

# చతుర్దశి



జమ్ములమడక
శ్రీకామాక్షి హైమవతీదేవి

అభినవభారతి, గుంటూరు



మూల్యము రు. ౨-౫౦



I

# చతుర్దశి

## రేడియో రచనలు

ఉపన్యాసములు



జమ్ములమడక

శ్రీకామాక్షీ హైమవతీదేవి

587

అభినవభారతి : గుంటూరు

II

గ్రంథాధికారము : అభినవభారతి
శోభకృత్ జ్యేష్ఠ పూర్ణిమ
౧౮౮౫ – 1963

వేయి ప్రతులు
వెల : రు ౨-౫౦



ప్రతులకు :


**జమ్ములమడక మాధవరామశర్మ**
ఏ. సి. కాలేజి, గుంటూరు

9

Presented by

Bollapragada
Krishna Rao
Principal Govt- Polytechnic
Guntur.

In the name of
His mother
Bollapragada Janikammagaru

—x—

13-3-'66

# మా అమ్మ

మా ఇంటిపేరు జమ్మలమడక. ఈ చతుర్దశి రచన చేసిన శ్రీ కామాక్షీ హైమవతీదేవి మా అమ్మ. మా నాన్న శ్రీ మాధవరామ శర్మ. మా అమ్మ శ్రీ వేదాంతం లక్ష్మీకాంతం కూతురు. మా అమ్మ అమ్మ శేషమ్మ మా అమ్మమ్మ. మా జమ్మలమడక వారి ఆడపడుచు అంటే మా నాన్న పెదనాన్న కూతురు. లక్ష్మీకాంతం తాతయ్య కూడా మా జమ్మలమడకవారి ఆడపడుచు కుమారుడు. తాతయ్య తల్లి మా నాన్న మేనత్త. మా అమ్మ మా ఇంటనే పుట్టింది. మా ఇంటనే పెరిగింది. మా నాన్నకు భార్య అయింది. మాకు అమ్మ అయింది.

మా నాన్ననాన్న శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రి మంచి పండితుడు. వందలకొలది విద్యార్థులకు భోజనం పెట్టి చదువు చెప్పాడుట. ఆయన శ్రీశ్రీశ్రీ వైరాగ్యానంద భారతీ స్వామి అయినారు. మఠంలోనో మా ఇంట్లోనో ఉండేవారు. మా అమ్మ శ్రీస్వామివారికి నిత్యము శ్రద్ధాభక్తులతో భిక్ష సమర్పించేది. సంస్కృతాంధ్రగ్రంథాల విషయాలన్నీ తెలుసుకునేది. వాళ్ళ నాన్నదగ్గర శ్లోకం పద్యం బాగా చదవడం నేర్చుకుంది. మా తాతయ్య స్వాములవారు అమ్మ చదివితే విని అర్థం చెప్పేవారట. మా అమ్మ అందరికీ అంతా చెప్పేది. మా నాన్న మా అమ్మకు మంచినగలు, మంచి చీరలు సంపాదించి ఇవ్వలేదు. అయినా అవి కలవాళ్ళకన్న మా అమ్మే మాకు బాగుండేది. మా నాన్న చాలా పుస్తకాలు సంపాదించాడు. మేమున్న ఇంటిలో ఎక్కడ కూర్చున్నా చేతికి పుస్తకం అందుతుంది కాబట్టి మా అమ్మ ఎప్పుడూ చదువుతూ ఉండేది. మమ్మల్ని ఎప్పుడూ కొప్పడనయినా కొప్పడలేదు. అందరు అమ్మలూ ఇట్లా ఉండలేరు. మా అమ్మ మా నలుగుర్ని కన్నది. ౧ కుమార మాధవ రామ విద్యార్థి ౨ భవభూతి ౩ భామతి ౪ శ్రీమతి. తర్వాత అయిదవ కాన్పు బిడ్డను కని అకాలప్రసవం వలన అమ్మ గతించింది. ఇప్పుడు మాకు అమ్మ లేదు. అయినా ఆనాటినుండి మా నాన్నే మాకు అమ్మకూడా అయినాడు. మా నాన్న జప పూజా యోగాలకు విద్యా వ్యాసంగాలకు గ్రంథరచనలకు ఉపన్యాసాలకు ఎంత ఆటంకం కల్గిందో మాకు ఏం తెలుస్తుంది?

మా ఇంట్లో బొత్తులు బొత్తులుగా కట్టలు కట్టలుగా గుట్టలు గుట్టలుగా ఉన్న వ్రాత కాగితాలు చూస్తూ ఉంటే మా అమ్మ రచనలు మా అమ్మ మాదిరి కన్పించినయి. విజయవాడ రేడియో వారి సూచనానుసారంగా ప్రసారముచేసిన రచనలు, అక్కడక్కడ స్త్రీల సభల్లో (పురుషులుగూడా ఉండేవారే) చెప్పిన ఉపన్యాసాలు కన్పడినయి. మా అమ్మ పలుకుతూ ఉన్నట్లే అనిపించింది. ఆమె కంఠస్వరం మైకుకు చాలా తగి ఉండేది. రేడియోలో పలికినా ఏమీ మెటాలిక్ సౌండు వచ్చేదే కాదు, ఆమె కంఠస్వరం బాగా ఉందని పద్యపఠనం ప్రశంసనీయంగా ఉందని కొందరు కొందరు ఆడవాళ్ళు అభినందిస్తూ ఉత్తరాలు వ్రాశారట. మా అమ్మ రచనలు దొరికినన్ని కూర్చి ఈవిధంగా ప్రకటించాలని అనుకున్నాము. ఇది చతుర్దశి అయింది. దీనిలో విషయాలు వేరువేరుగా ఉన్నయి. అన్నిటిలోనూ స్త్రీ విషయమే ఉంది. రేడియో వారి వనితావాణి కార్యక్రమంలో సూచించినవేగా! కొన్నికొన్ని దేవీ నవరాత్రాలలోని ఉపన్యాసాలు, శ్రీ కల్యాణానంద భారతీ మాంతాచార్య మహా స్వాములవారి సమక్షంలో శ్రీవిద్యా మంత్ర దీక్ష స్వీకరించిన మా అమ్మ దేవీ నవరాత్రాలలో దేవీ విశేషమునే చెప్పేది. అందువల్ల అంతటా చతుర్దశిలో స్త్రీ దేవతలే ఉన్నారు. అమ్మ బ్రతికిఉండగా వీనిని అచ్చువేయాలన్న ఊహలేదు. సౌకర్యమూ లేదు. ఇప్పుడున్నూ సరైన సౌకర్యం లేదు. అయినా అమ్మ అబ్దికం సమయానికి అచ్చువేయించాలి అనిపించింది. అమ్మ జ్యేష్ఠపూర్ణిమ శుక్రవారంనాడు దేవీలోకం చేరింది. ప్రతి జ్యేష్ఠపూర్ణిమా మాకు అమ్మ పూర్ణిమ. ఈ చతుర్దశిలో మా అమ్మ ఉన్నది. నాన్న వేతనం భోజనానికయినా చాలడంలేదు. అయినా కొన్ని సౌకర్యాలు తగ్గించుకొని అచ్చు వేయాలి అనుకున్నాము. ఇప్పుడు మాకు నాన్నే అమ్మకూడా అయినందున ఈ వ్యయం ఎట్లాగో వచ్చింది. ఈ చతుర్దశికి మానాన్నే ఏమయినా వ్రాస్తే బాగా ఉంటుందేమో అనుకున్నాము. అయినా ఆయన్ని కదిలిస్తే బయటికి నవ్వుతాడని మాకు తెలుసు. ఆయన ఉత్త ఉత్తర రామ చరిత్ర. మా కళ్ళకు మాత్రం అభినవుడు. నాన్న ఆదరం ఎంతగా ఉన్నా అమ్మ వాత్సల్యం అనుభవించలేదని బాధగా ఉంటున్నది. ఈచతుర్దశి మానలుగురి దశను అనుకూలంగా మార్చుతుందని అనుకుంటున్నాము. మాలో చిన్నపిల్ల శ్రీమతి పేరంటాలకు వెళ్లేవాళ్ళను చూచిచూచి "వీళ్ళలో అమ్మ లేదు"

అనేది. భామతి గద్యభారతం చదివి చదివి "అమ్మ ఇట్లాగే చదివేదిరా!" అంటుంది. భవభూతిని చూచి "అమ్మ నిన్ను ఆదరంగా చూచేదిట అని అందరూ అనడం మామూలు. పెద్దవాడు పద్యం చదివితే అంతా అమ్మే అని నలుగురం అనుకుంటాము. ఇటువంటి సమయంలో మానాన్న దూరంగా వెళ్తాడు. అమ్మ గతించి ఇన్ని సంవత్సరాలయినా అమ్మతో పరిచయం ఉన్న వాళ్ళందరికీ అమ్మ బాగా గుర్తు. ఎవరయినా కవి పండితులు పండితలు మా ఇంటికి వచ్చి అమ్మను జ్ఞాపకం చేస్తూనే ఉంటారు.

ఈ రచనల నిర్మాణంలో మానాన్న సహకారం ఉన్నదా? లేదా? మేము ఏమిచెప్పగలం? మా అమ్మ ఉన్న దినాల్లో ఆమె ఆదరం అనుభ వించడము తప్ప ఇతరవిషయాలు తెలియవు. అయినా ఇప్పుడు ఈవిధంగా అనుకుంటాము. చాలామంది రచయితలు మా ఇంటికి వస్తారు. అవసర మయినవి చేర్చుకుని మార్చుకుని సర్దుకుంటూ ఉంటారు. మా అమ్మ రచనలు కూడ ఈ విధంగానే అయిఉండవచ్చు. లేదు లేదు. అంతా మా అమ్మే వ్రాసింది. అని మేమేదో తెలిసినట్లుగా వ్రాస్తే లోకం నమ్మదు. ఇక భాష విషయం. మా నాన్న మాటలు కన్పడుతూ ఉంటయ్యని ఆ భాష అలవాటు ఉన్నవాళ్లు అనుకోవచ్చు. ఇది అంత అనుకోతగ్గ విషయం కాదు. బాగా వివేకంలేని మా మాటల్లోనే కొంతకొంత మానాన్న మాటలు మెరుస్తూ ఉంటయి. చదువుకొన్న మా అమ్మ తగినంత సౌకర్యము పొంది ఉండవచ్చు. స్త్రీలు ఏమయినా వ్రాశారు అనగానే అవి వారే వ్రాశారా? అనే మాటలు అంతటా వినపడుతున్నయి. మా అమ్మ విషయంలో ఎవరూ సందేహించ నక్కరలేదని మా అమ్మను ఎరిగిన వాళ్ళందరూ గట్టిగా చెప్పగా శ్రద్ధగా విన్నాము. ఆ విషయాన్నే మీకు నివేదిస్తున్నాము. ప్రసిద్ధులయిన ఒకరు దంపతుల విషయాలు వ్రాస్తూ మా ఇంటి విషయంలో కొన్నిమాటలు వ్రాసి మా అమ్మ నాన్న ఒకళ్లొకళ్లు సంస్కృతంలోనే ఏదో అనుకున్నారని అది మాకు బాగా తెలియనందువలన పోట్లాటే అయి ఉంటుందని ఊహించామని వ్రాశారు. ఈ మాట బలే చమత్కారంగా ఉంది. అయినా మా అమ్మ బాగా సంస్కృతం తెలిసిన అమ్మ అని స్పష్ట మవుతోంది. అప్పుడప్పుడు కవులు పండితులు మా ఇంటికి వచ్చేవారు. వారిగ్రంథాలు వాదాలు విన్పించేవారు. వారటు వెళ్ళగానే వారివిశేషాలు మా అమ్మ వ్యాఖ్యానించేది. మానాన్న కొంచెం మందలించినా ఒప్పుకునే

వాడు. ఒకసారి భువనవిజయ మహాసభ జరిగింది. వారందరూ మా ఇంట్లో విందులారగించారు. వడ్డించేసమయంలో ఆముక్తమాల్యదలోని పద్యంచదివిందట. "కృపయాభోక్తవ్యం" అన్నదట. ఇక మా అమ్మకు ఈ రచనల విషయంలో కల శక్తిసామర్థ్యాలను మేము ఏమి ఊహింపగలము! ఒకసారి మా ఇంట్లో బియ్యం, పప్పు, నెయ్యి, అన్ని అయిపోయినవట. మానాన్న దీక్షగా నాట్యవేదం వ్రాసుకుంటున్నాడు. ఆయన వ్యాసంగానికి మా అమ్మ ఎన్నడూ విఘ్నం కలుగజేసేది కాదు. ఆయా పుస్తకాలందించి సహాయం చేసేదికూడా. చాలాసేపు అలాగే ఉండి "నాట్యాచార్యా! తండులంబులు నిండుకొన్నవి. సూపం నాస్తి. ఘృతం నాస్తి. పిల్లలకు ఆకలవుతుంది" అని పరిహాసంగా అందిట. ఇక మా అమ్మ విద్యా వివేకాలను గురించి అధికంగా మేం ఏం చెప్పగలము. ఇప్పుడయితే కొంత చెప్పగలిగేవాళ్ళము. ఎవరితో ఎప్పుడు మాట్లాడినా ఏదో ఒకపద్యం ఏదో ఒక సామెత కోమల పరిహాస గర్భంగా పలికేదట. ఈ రచనలు చదవండి. మా అమ్మ తెలుస్తుంది.

మా అమ్మ ఈవిధంగా రచనలు చేస్తుందని ఉపన్యాసాలు చెప్పుతుందని లోకానికి బాగా తెలియదు. విజయవాడలో దేవీ నవరాత్రాలు చేస్తూ గౌరవంగా వచ్చి పిలిస్తే ఆపూట మమ్మల్ని వెంటపెట్టుకుని వెళ్ళి ఇంటికి వచ్చి జపం చేసుకొనేది. ఇతర స్థలాలకు వెళ్ళి ఉపన్యసించలేదు. ఆ ఉపన్యాసాలైనా ఇంటిదగ్గర చక్కగా చదువుకొని విషయం సిద్ధంచేసుకుని వ్రాసుకొని వెళ్ళేది. ఇతర స్థలాల కెప్పుడూ వెళ్ళలేదు. చుట్టుపక్కల బంధువుల ఇళ్ళల్లో స్త్రీలను కూర్చోపెట్టి గోష్ఠిగా ఎప్పుడూ ఏదయినా చెపుతూ ఉండేది. ఇంతేకాని మా అమ్మకు అంతగా తీరిక లేదు. మాకు సేవచేయడం ఇల్లు సర్దుకోవడం శుచిగా రుచిగా పాకం చేయడం జపం చేసికొనడం. ఈ విధంగా మా అమ్మకు తీంకేలేదు. బాగాచదువుకొనేది. నలుగురికీ చెప్పేది. చిన్నపిల్లలం మేము చదువుకొనేవయస్సు వచ్చేటప్పటికి అమ్మ లేదుగదా అనిపిస్తోంది.

మా అమ్మనాన్న శ్రీ వేదాంతం లక్ష్మీకాంతం తాతయ్య ఎంత గొప్పవాడో మా ఊహకు అందదు. మాఅమ్మ మాకు ఎంతో గొప్పకాబట్టి మా అమ్మనుకన్న కాంతం తాతయ్య ఎంతో గొప్పవాడనిపిస్తుంది. ఆయన వేదాంతి. కవి. అయినా మా అమ్మ సంగతి తెలియగానే మా అందరికంటె

ఎక్కువగా చిన్నపిల్లాడు అయినాడట. ఆయన మా యింటిలో ఉండ వలసిన మనీషి అయినా మా అమ్మ ఉన్నప్పుడు ఎప్పుడో ఒకటి రెండు సార్లు వచ్చి కొన్నినాళ్ళు మాత్రమే ఉన్నాడు. మా కదంతా స్వప్నకథ మాదిరి ఉంటుంది. ఆ తర్వాత మళ్ళీ రానే లేదు. మేమే వెళ్ళాం. ఆయన హృదయం సముద్రం అయింది. అమ్మ పూర్ణిమకై ఇటువంటి చతుర్దశి వస్తున్నది అని కాంతం తాతయ్యకు సూచిస్తే ఆయన ఈ విధంగా

"శ్రీమతి హైమవతి చిత్తస్థైర్యమున పార్వతి. వాక్కున సరస్వతి. ఉల్లాసమున రతి. పుట్టింటివారి వేదాంతమును – అత్తవారింటి సాహిత్య వాఙ్మాధురీ నిష్ఠను తనయందు మూర్తీభవింపజేసికొన్న కల్యాణి. సహజ కవితా గాన ప్రియ వాక్కు లీ యిందువదనకు నైజములు. పద్యమును - శ్లోకమును- దండకమును- ఈ కుమారీమణి- గమకముతో - యమకముతో - తన్మయత్వముతో చదువుచుండ, పలుమారు వినుట, నా యపూర్వ పూర్వ పుణ్యము అనుట- అతిశయోక్తి కాదు. నానా కవి గాయకులు పద్యములు చదువ వింటిని. కాని, ఎక్కడి కెక్కడ?. శ్రీ మాధవార్ధాంగి - జమ్ములమడక వంశ లక్ష్మి- గద్య పద్య పఠనమును మరల వినవలయునని బహుగా యువ్విళ్ళూరుదును. నాయట్టివానికిలభించునా!" అని వ్రాయగా;

ఈ మాటలు వినీ వినగానే భామతి "పా....పం!" అంది. మేము కూడా ఆయన్ని ఓదార్చాలి. ఇంత సెన్సిటివ్ గా ఉండేవాళ్లు ఉత్త సుతిమెత్తనగా ఉంటారు. మాకిది నిత్యం తెలుసు. విజయవాడ ఆకాశవాణి అధికారుల అనుజ్ఞ అందుకుని వారి సౌహార్దమును అభినందించుకుంటూ దీన్ని ప్రకటిస్తున్నాము. మాకు భావ భావనము, భావయిత్రీ భావనము బలము సంపాదించింది, మా నాన్న రేడియో సంభాషలు శతాధికంగా ఉన్నాయి. ఉపన్యాసాలు సహస్రాధికంగా ఉన్నాయి. వానిని సిద్ధపరచి ప్రకటించగల సామర్థ్యం మాకు లేదు. ఈ చతుర్దశిని మాత్రం మీకిప్పుడు ఈ విధంగా అందించగల్గుతున్నాము.

మా అమ్మను గురించి ఎంతైనా చెప్పుకోవాలనిపిస్తుంది. మా నాన్న అమ్మ అమ్మకు అత్త అయినా అసలు అమ్మమ్మ కాఇట్టి ఎప్పుడూ "అమ్మమ్మా" అనే అనేది. స్వాములవార్నికూడా మొదట మొదట "తాతయ్యా" అనేదిట. అట్లా అనరాదని వారు అన్నప్పటికి "పెళ్లైన తరువాతకూడా ఎత్తుకున్నావు. ఇప్పుడు వెంటనే ఎట్లా మారుతుంది"

అనేదిట. మా నాన్నను కూడా ఒకప్పుడు "ఒరే చిన్నమామయ్యా !" అని చూచారూ ! చిన్నప్పుడు లాలించి పున్నాగ పువ్వు లిచ్చిన ఫలం" అందిట. మా నాన్న "జాయే ! భార్యే ! ధర్మపత్ని !" అని పిలిచేవాడే కాని "ఒసేవ్ ! ఓసీ" అని అననే లేదట. "కోపం ఎట్లా ఉంటుందో మీకు తెలుసా ?" అని అమ్మ నాన్న నడిగిందిట. మా ఇల్లు కావ్యం, అమ్మా నాన్నా కావ్యం పలికేవాళ్ళు, అందుకే ఈ చతుర్దశి. మా పెదనాన్న మా అమ్మకు పెదమామయ్య. మా అమ్మను "కామక్కా" అనేవాడు మా ఇంటిలో కామేశ్వరి కులదేవత. అందుకనే అందరూ మా అమ్మను అభిమానించేవారు. మా పెదనాన్న చిన్నకూతురు ఉదయరాణి తల్లిలేని పిల్ల అయిందని మా అమ్మ అమ్మగా లాలించింది. అమ్మ నాన్న ఉదయరాణి వివాహంచేశారు. అమ్మకు కన్యాదానఫలం ఈ విధంగా లభించింది. మా అమ్మ అభిమానం ఇప్పుడు మాకు లేదు. కాని మాకు వదిన వచ్చింది. ఆ లోటు లేదు అనుకుంటున్నాము.

E

# చతుర్దశి

## ౧ ఉపేక్షిత వనితలు

"కావ్యం కాంతాసమ్మితం" అంటారు కదా! కావ్యాలలో కామినీమణులు ఉంటేనే కాని కావ్యాలకు అందం రాదట. అందుకనే ప్రతికవీ తన కవిత్వానికి అందం సంపాదించాలని, తానూ గౌరవం సంపాదించాలని ఏదో విధంగా స్త్రీలకు ప్రవేశం కల్పించుతూనే ఉన్నాడు. విశేషించి శృంగార గ్రంథాలలో యీ స్థితి తప్పనే తప్పదు గదా! కరుణరసం వర్ణించాలని కవి అనుకుంటే శోకదేవతగా స్త్రీ అవతరించాల్సిందే! హాస్యరసంలో స్త్రీలను ప్రవేశపెట్టకపోతే ఆ రచయితే హాస్యాస్పదుడవుతున్నాడు. ఈ విధంగా మూడు రసాలలో మాత్రం ఆడవాళ్ళకు ప్రవేశం యిస్తున్నారు. మగవారయిన కవులు స్త్రీలకు కల్పించే ఈ రసత్రయప్రవేశం యెంతగా బావుంటున్నదో లోకానికి తెలుసు.

ఇంకా యెన్నో రసాలు ఉన్నవి కదా! ముప్ఫయి మూడు భావాలు ఉన్నవి అని ఆలంకారికులు అంటున్నారు కదా! ఆ రసాలలో ఆ భావాలలో స్త్రీలకు ప్రవేశం లేదేమి? ఇతర రసాలలో స్త్రీలకు ప్రవేశం లేదా? వీరి మానవత్వంతో వానిలో మాత్రం సామర్థ్యం సంపాదించలేరా! స్త్రీల అభ్యుదయాలకు పురుషులే ఉపయోగిస్తారని వారే వీరి జీవితగతులను సూచిస్తారని లోకంలో ఒక గూఢమయిన భావ మున్నది. దీనిని యెవరూ కాదని అననక్కరలేదు. కాదనము కూడాను. కానీ ఒక విషయం విన్నవించుకోవాలి.

ప్రపంచజీవితంలో స్త్రీలకు ఉన్న నైతికములు, ధార్మికములు, సామాజికములు అయిన హక్కులను ఎవరూ అణచిపెట్టకూడదు. ఎవరయినా వీని వికాసానికి అడ్డుపడితే నారీమణులు తమ నారీశక్తిని చూచుకుంటూ నైతిక ధార్మిక సామాజిక రంగాలలో గతివేగం సంపాదించుకోవలసిన అవసరం ఉంది. అవసరమయిన ఆయా అంశాలలో స్త్రీల విషయమై రచయితలు చూపిన ఉపేక్ష యిటు మీదట ఉండరాదు. ఇంతకూ ఒక ప్రధానమయిన కారణం ఉందిలెండి. ఆడవాళ్ళమైన మనం ఇంత కవితాకావ్యరచనం చేయుగలుగుతున్నామా! రచనాసామర్థ్యం సంపాదిస్తున్నామా! సముచితమయిన ఈ అర్హత సంపాదించే వఱకు ఈ ఉపేక్ష తప్పనే తప్పదు.

ఆదికవి వాల్మీకి అంతటివాడు లక్ష్మణుడు అన్నతో అరణ్యానికి వెళుతూ ఉంటే ఊర్మిళాభావాన్ని ఏమీ విచారించలేదు. తన అక్కగారు సీతాదేవి రామునితో బయలుదేరిందిగదా! తనుమాత్రం తన లక్ష్మణునితో బయలుదేరాలని అనుకోలేదూ! ఆమె హృదయం పరితపించలేదూ! ఆమె వేదన పొందలేదూ! వేదనాపరితాపాలతో ఉన్న ఊర్మిళావదనముపై ఓమహర్షీ! ఓమహాత్మా! ఓవాల్మీకీ! చల్లని నీ కమండలూదకమును కొంచముగానైనా చిలకరించలేదేమయ్యా! సీతారాముల దాంపత్యం ముఖ్యంగా చెప్పదలచిన వాల్మీకిమహాకవి ఊర్మిళను ఈ విధంగా ఉపేక్షించవలసి వచ్చినా ఉపేక్షిత ఉపేక్షితయే కదా! "ఊర్మిళాదేవినిద్ర" అన్న ఆడవాళ్ళపాటల్లో ఊర్మిళను ఏమీ ఉపేక్షించలేదు.

ఒక తల్లి బిడ్డడయిన కాళిదాసు శాకుంతలం బాగా వ్రాశాడట. దానిలో ఇద్దరు స్త్రీలను ఉపేక్షించాడు. అనసూయ, ప్రియంవద అనే యిద్దరు ఋషికన్యలు చిన్నప్పటినుండి శకుంతలతో సావాసంగా ఉన్నారు. ప్రియంవద ప్రియంవదగానూ, అనసూయ అమాయకంగానూ, ఆమెకు కష్టసుఖాలలో చాలా అనుకూలించారు. సరే! శకుంతల అత్తవారింటికి వెళ్ళింది. ఆమె పరిస్థితినే కాళిదాసుగారు చెప్పారు గాని, అనసూయా ప్రియంవదలు ఏమైనారో! కణ్వాశ్రమంలో ఉండి తపస్సే చేసుకుంటున్నారా! వారున్నూ గృహిణీపథంలో ప్రవేశించారా! ఏమీ తెలియడంలేదు. వాళ్ళను పాపం కవి లోకం ఉపేక్షించింది.

బాణభట్టు కాదంబరి వ్రాశాడు. చంద్రాపీడుని తల్లి విలాసవతి కుమారుడయిన చంద్రాపీడునిదగ్గర కులూతేశ్వరుని కుమార్తె అయిన పత్రలేఖను తాంబూలాలను చుట్టి యివ్వడానికి దగ్గర అట్టేపెట్టింది. "అబ్బాయీ! దీన్ని నీవు గౌరవంగా చూడాలి" అనీన్నీ చెప్పింది. అందాలబరిణ అయిన ఆ అమ్మాయిని కోమల కుసుమంగానే గౌరవించాడు. కాని పత్రలేఖ మహాశ్వేతాశ్రమం దగ్గర అచ్ఛోద సరస్సులో అమాంతం దూకింది. ఆ అమ్మాయి ఏమయింది? ఆ సరస్సులో దూకిన ఇతరులు లోకానికి వచ్చారే! పత్రలేఖ ఏమయింది. పత్రలేఖ ఏమీ అప్రధానురాలు కాదే! బాణభట్టారకా! మా పత్రలేఖను ఇంతగా ఉపేక్షించినావేమయ్యా!

సృష్టిలో సమ ప్రాధాన్యం ఉన్న స్త్రీని ప్రపంచ యాత్రలో ఏ విషయంలోనూ ఉపేక్షించకూడదు. నైతికము

లయిన వ్యవస్థలు స్త్రీలవలన భగ్నములై పోతవి అనే అభిప్రాయానికి స్త్రీలు అవకాశం యివ్వకూడదు. సమాజ శ్రేయస్సులో స్త్రీల విషయంలో ఏమాత్రం ఉపేక్ష లేకుండా ఉండడం చాలా అవసరము. అందుకనే స్త్రీలు నానా విషయాలను చక్కగా తెలుసుకుని స్త్రీల అర్హతలను బాగా గుర్తుంచుకొని స్త్రీలున్నూ రచనా సామర్థ్యం కలవారయినప్పుడు తగిన యోగక్షేమాలు బాగా కలుగుతవి.



## ౨ రామాయణంలో ఊర్మిళ

శ్రీ రామాయణము అందరకు తెలిసిన మహాకావ్యము. రాముడు దశరథవంశమువాడయినా జనకవంశమువలన గౌరవం పొందగలిగాడు. సీత, ఊర్మిళ, మాండవి, శ్రుతకీర్తి ఈ నలుగురూ పుట్టినింటికీ మెట్టినింటికీ గౌరవమర్యాదలు సంపాదించారు. రామ గౌరవమును సీతాదేవి సంరక్షించడములో అంతగా ఆశ్చర్యం లేదు. లక్ష్మణుని గొప్పదనానికి ఊర్మిళ కారణం కాగలిగింది అనేదే మెచ్చదగిన అంశము.

ఊర్మిళాదేవి సాక్షాత్తు జనకునికూతురు. జనకుని పెద్ద భార్య సుమేధ. రెండవభార్య సునయనయందు ఊర్మిళ కలిగింది. ఆదిశేషుని శక్తి ఊర్మిళగా అవతరించిందని పౌరాణికులు అంటారు. ఊర్మిళ లక్ష్మణుని భార్య అయింది. కష్టపు దినాలన్నీ గడిచిపోయిన తరువాత ఊర్మిళా లక్ష్మణులకు ఇద్దరు కుమారులు జన్మించారు. అంగదుడు - చంద్రకేతువు అని వారి పేర్లు. వారు ప్రభువులయినారు.

పుట్టింట ఉన్నంతకాలం ఊర్మిళ అక్కగారయిన సీతను అనుసరించే ఉంది. అత్తవారింటికి వెళ్ళింది. అక్కడ అపూర్వములయిన సుఖశాంతు లనుభవింపవచ్చు. ఊర్మిళ పతిదేవుణ్ణి అసాధారణంగా ప్రేమించింది. సుమిత్ర తన కోడలిని చూచి ఎంతగానో ఆనందించి ఉంటుంది. ఒక్క సుమిత్రేకాదు కౌసల్య కైక కూడ ఊర్మిళను అభిమానించారు. ఈమె నా కోడలు నేను అత్తను అని ప్రత్యేకంగా ఎవరూ అనుకోలేదు. సహనము, వినయము, సౌశీల్యము మొదలయిన సద్గుణాలు అత్తలనందరినీ సంతోషపెట్టినవి. భర్తపై భక్తి, ప్రేమలు బావలపై శ్రద్ధా, ఆదరములు, మరదిపై ఔదార్యము, వాత్సల్యములు ఊర్మిళకు స్వతఃసిద్ధముగా ఉన్నవి.

రాముడు వనవాసానికి వెళ్ళాడు. లక్ష్మణుడు రాముని అనుసరించాడు. ఇట్లవుతుందని ఊర్మిళ అనుకోలేదు. ఆమె హృదయంలో ఎంత వేదన కలిగిందో ఏమో! సీతారాములు, లక్ష్మణుడు వనవాసానికి వెళ్తున్నారు. ఈ వార్త అందరికీ దుఃఖము కలుగజేసింది. మామగారు గతించారు. అత్తగార్ల అవస్థ చెప్పరానిది. ఊర్మిళ మనస్సులోని క్షోభము ఎవరికి తెలుస్తుంది. ఊర్మిళా ప్రాణనాథుడు లక్ష్మణుడు కూడ వనవాసానికి వెళ్ళాడే! లక్ష్మణుని చూడాలని ఆయనవార్త తెలుసుకోవాలని ఊర్మిళ తహతహలాడి ఉంటుంది. వనవాసంలో సీత శ్రీరామునకు సేవ చేస్తోంది. తన లక్ష్మణుని తాను సేవించుకోలేనిదయిందికదా. లక్ష్మణుడు తన యిచ్ఛానుసారంగా వెళ్ళాడు. తల్లిదండ్రులవలె చూడదగిన అన్నావదినలను ఆరాధించుతూ ఆయన వనానికి వెళ్ళాడు. ఊర్మిళ తానుకూడ

భర్తతో వెళ్ళితే తనలక్ష్మణుని కర్తవ్య పాలనము ఈవిధంగా ఉంటుందా? లక్ష్మణుడు తన ధర్మాన్ని పూర్ణంగా నిర్వహించిన వాడౌతాడా? ఊర్మిళ ఇదంతా గ్రహించి ౧౪ సంవత్సరాలు మహా విరహాన్ని అనుభవించింది. తన భర్త చేయవలసిన పనిలో తానేమీ బాధ కలుగజేయరాదు. ఊర్మిళా జీవితము ధన్యము. లోకంలో అందరు తన లక్ష్మణుని ప్రశంస చేస్తున్నారు. దీర్ఘవిరహ మనుభవించే ఊర్మిళకు ఆ ప్రశంస ఊరటకలుగజేసి ఉండాలి.

భరతు డరణ్యంలో శ్రీరాముని కలుసుకొనడానికై వెళ్ళాడు. అయోధ్య అంతా కదిలి వెళ్ళింది. కానీ ఊర్మిళ రాజభవనంలోనే ఉండవలసి వచ్చింది. మాండవి, శ్రుతకీర్తి తమ భర్తలను సేవించుకుంటారు. కానీ ఊర్మిళకు తన లక్ష్మణుని సేవించుకుండే భాగ్యమేది? లక్ష్మణుని ధర్మపాలనంలో తాను సహాయపడింది. అది ఆమెకు సుఖమిస్తుందికాబోలు.

భరతుడు రామపాదుకలుగ్రహించి తిరిగి వచ్చాడు. నందిగ్రామంలో మునివృత్తి స్వీకరించాడు. శత్రుఘ్నుడు భరతుణ్ణి అనుసరించిఉంటున్నాడు తమభర్తలు ఒకచోట ఉన్నారని మాండవీ, శ్రుతకీర్తులు ఊరట పొందుతారు. కాని ఊర్మిళకు తనలక్ష్మణుడెక్కడున్నదీ తెలియదు. ౧౪ సంవత్సరాలు వేళ్ళపై లెక్కపెట్టుతున్నది కాబోలు. తన తోడికోడళ్ళకున్న భాగ్యము తనకులేదా? జనకవంశములోని ఆడవాళ్ళందరికీ ఈ విరహానుభవమే వ్రాసిపెట్టిఉన్నది కాబోలు! అందులోను ఊర్మిళావిషయము చాలా జాలిగా ఉంటుంది. ఆమెత్యాగము ఆమెతపస్సు సఫలము లయినవి. వనవాసాన్నుంచి అందరూ

తిరిగివచ్చారు. తనలక్ష్మణుడూ వచ్చాడు. తన త్యాగ తపస్సుల ఫలంగా ఇద్దరు కుమారులు జన్మించారు. వారూ సుప్రభువులయినారు. తుదకు రామునితోపాటు భరతాదులు సరయూనదిలో మునిగి పరంధామును చేరుకున్నారు. ఊర్మిళ కూడ సరయూమార్గంలో పతిలోకం చేరుకున్నది.

వాల్మీకి తన రామాయణంలో ఒక్క సీతాదేవినే బాగా నిరూపించాడు. ఒకపక్కగా నిలబడి సంసారసుఖాలకు దూరమై వాడిపోయినవదనంతో బిక్కుబిక్కు మంటున్న ఊర్మిళాముఖముపై చల్లడానికి వాల్మీకి కమండలములో ఒక్క జలకణమయినా లేదు కాబోలు. వాల్మీకి ఊర్మిళనుపేక్షించాడు. అయినాసరే లోకం తమ హృదయాలలో ఊర్మిళకు అవకాశమిస్తుంది. ఊర్మిళ అనేది ఎంతచక్కని పేరు. ఎంత మధురమయిన పేరు. ద్రౌపదికి ఊర్మిళ అనిపేరుంటే ఏమీ బాగుండదు. ఈ పేరుపెట్టినందుకైనా వాల్మీకిమహర్షికి నమస్కరించాలి. ఈమెపేరు మార్చి మాండవిఅనో శ్రుతకీర్తిఅనో అనలేదు.

జనకుని పట్టణంలో కల్యాణవేదికదగ్గరగా పెళ్ళికూతురు వేషంలో ఊర్మిళ కన్పడుతూంటుంది. తర్వాత అయోధ్యపట్టణంలో అంతఃపురం చేరింది. ఇక ఆపిల్ల మనకు కన్పడనే కన్పడదు. మనమెప్పుడాలోచించినా. ఊర్మిళ పెళ్ళికూతురు వేషములోనే కన్పిస్తుంది. వివాహ సమయంలోకూడ ఏమీ. పలుకదు. సిగ్గుతో తలవంచుకొని కోడలుకుకోడలుగా ఉంటుంది. ఊర్మిళా హృదయంలో ఇతరస్త్రీలకువలె ఊహాలు లేవా ? కాంక్షలులేవా ?

సంస్కృతకవులు కొందరు తమనాటకాలలో ఊర్మిళను కొంతగా చెప్పారుట. ఎంత జెప్పినా ఏమిచెప్పటం సీతబుజాల వెనుక దాక్కున్నట్లు చెప్పిఉంటారు. భవభూతి మహాకవి ఊర్మిళను మరొక్క పర్యాయము బొమ్మలో చూపించాడు. సీతను సంతోషపెట్టటానికి చిత్రపటం తెచ్చారు. రామకథను లక్ష్మణుడు చూపిస్తున్నాడు. "వదినా! ఇదిగో మీరు ఇక్కడ ఉన్నారు. ఇదిగో ......... ఇదిగో! మాండవీ శ్రుతకీర్తులున్నారు" అని లక్ష్మణుడుచెప్తూ ఊర్మిళను చెప్పనేలేదు. "లక్ష్మణా! ఈ పిల్ల ఎవరు?" అని సీత అడిగినా మురుసుకుని పోతాడేగాని లక్ష్మణుడు చెప్పనేచెప్పడు. చిత్రవిచిత్రమ్మైన సుఖదుఃఖాలతో ఉన్న చిత్రంలోకూడా శ్రీరాముడు ఒక్కసారి కుతూహలానికైనా సరే ఊర్మిళను వేలుతోనైనా చూపలేదు. ఆమె మరదలుపిల్ల! వేలెత్తి చూపరాదని అనుకున్నాడు, కాబోలు ఆ ధర్మప్రభువు.

కొత్తకోడలుగా ఊర్మిళ దశరథవంశంలోకి వచ్చింది. రామాభిషేకం జరుగుతుందని అందరూ చురుకుగా సంచరిస్తున్నారు. ఈ కొత్తకోడలు ప్రసన్నముఖంతో ఏపనిలోకి వచ్చినట్లు కనపడదేమి! తన లక్ష్మణుడు తాపసవేషముధరించి వనవాసానికి వెళ్ళితే ఆనాడు ఊర్మిళ రాజప్రాసాదములో ఏమూల శూన్యహృదయంతో, తొడిమజారిన పువ్వువలె ఏదుమ్ములో దొర్లుతున్నదో ఎవరికి తెలుసు? సీతారాములకై తనకంటె అధికమైన తన ఆత్మప్రభువును సమర్పించుకున్నది, స్త్రీ జీవనంలో అటువంటి వయస్సులో ప్రియపతిని దూరాన ఉంచి ౧౪ సంవత్సరాలు ఆమె ఎట్లా గడిపిందో! సీతావ్యథను

చాలమంది వర్ణించారు. సీతాపాదపీఠం దగ్గర ఊర్మిళకు స్థానం ఇవ్వలేదేమి! హిందీకవులు కొందరు వ్రాశారుట. సమాజ కల్యాణానికై ఊర్మిళ తన స్వార్థమును త్యాగంచేసింది. అ సమయంలో తాను సన్యాసిని అయింది. మహాకవులందరు తమ కావ్యాలలో ఊర్మిళ నుపేక్షించారు. ఊర్మిళ ఉపేక్షింపవల సిన వనితకాదు.

లక్ష్మణదేవరనవ్వు, ఊర్మిళాదేవినిద్ర అని తెలుగు దేశంలో స్త్రీల పాటల పుస్తకాలున్నయికదా! దానిలో కొన్ని కొత్త విషయాలున్నాయి. పట్టాభిషేకం అయి కొలువులో ఉండగా ఆకస్మికంగా లక్ష్మణునికి నవ్వువచ్చింది. ఎందుకు నవ్వు తున్నావు అని అందరూ అడిగారు. అరణ్యంలో ఉండగా నిద్రాదేవి ఒకనాడు లక్ష్మణుని దగ్గరకువచ్చింది. "ఇప్పుడు కాదు ప్రస్తుతము నేను అన్నగారిని సేవించాలి. అయోధ్య చేరగానే రా! ఈలోపుగా ఊర్మిళదగ్గరకు వెళ్ళు నావిరహబాధ లేకుండా ఆమె ఉండగలుగుతుంది" అన్నాడుట. ఇప్పుడయో ధ్యకు రాగానే నిద్రవచ్చేటప్పటికి లక్ష్మణునికి నవ్వువచ్చింది. ౧౪ సంవత్సరాలు ఊర్మిళ నిద్రపోయిందని చెప్పకొనేవారికి ఈ లక్ష్మణదేవర నవ్వు ఆధారంగా ఉంది.

ఊర్మిళాదేవినిద్ర స్త్రీలందరూ పాట పాడుకొంటారు. రాముని దగ్గర అనుజ్ఞతీసికొని లక్ష్మణుడు ఊర్మిళాంతఃపురా నికై వచ్చాడు. కలతనిద్దరలో ఉన్న ఊర్మిళ కంగారుపడింది. తర్వాత వార్తలన్నీ తెలుసుకొంది. లక్ష్మణునితో మంతనా లాడింది. ఈవిధంగా తెలుగులో పదకర్తలు ఊర్మిళావిష యంలో ఒక ఊహ ప్రదర్శించారు. ఆ పాటలో నాలుగు చర ణాలు చదవండి.



# ౩ ముగ్గురు తల్లులు – కైకేయి

మానవుల జీవితంలో కీర్తి అపకీర్తి వారివారి భాగ్యాన్ని బట్టి కలుగుతూ ఉంటయి. ఒక్కొక్కరికి యశస్సు ఏమీ యత్నం లేకుండగానే వస్తుంది. ఒక్కొక్కరికి అపయశస్సు దానంతట అదే వస్తుంది. దానికై వారు ఏమీ చేయనక్కర లేదు. అది వారికి ఇష్టమనీ అనలేము. అంతే. కైకేయికూడా ముగ్గురు మహాతల్లులలో ఒక మంచితల్లి. అయినా అపకీర్తి రానేవచ్చింది. ఆమె ఏమిచేస్తుంది. బాగా ఆలోచిస్తే కైకేయి తప్పు ఏమీ లేదనే తెలుస్తుంది.

కేకయదేశాల మహారాజుగారికి కైకేయి ముద్దులబిడ్డ. దశరథ చక్రవర్తి కైకేయిని తన కివ్వవలసిందని కేకయ మహారాజును అర్థించాడు. కేకయమహారాజు బాగా ఆలోచించి ఈ విధంగా అన్నాడు. "మీతో సంబంధం గొప్ప అదృష్టమే. కాని నా కూతురు రాజమహిషి కావడమేకాక రాజమాత కూడా కావాలని నా కోరిక. ఇది ఎట్లా కుదురుతుంది. మీకు ఇంకా పెద్ద రాణులున్నారు. వారి పిల్లలకే రాజ్యాధికారం వస్తుందికాని, మా అమ్మాయి సంతానానికి రాజ్యాధికారము రాదుకదా! దశరథ సార్వభౌమా! మా అమ్మాయిని నీకు ఎట్లా ఇవ్వగలను?" అపుడు దశరథుడు "మీ అమ్మాయి సంతానానికి రాజ్యం లభిస్తుంది" అన్నాడు. కైకేయీ దశరథులకు వివాహం అయింది. ఈ రాజ్యవిషయం కైకకు ఏమీ తెలియదు. ఆమె సరళచిత్త. కల్లాకపటం ఎరుగదు.

దశరథునకు ముగ్గురు రాణులయినారు. వారు పుత్రులనూ కన్నారు. ముగ్గురు రాణులలో మహారాణి కైక అంటే దశరథ మహారాజుగారికి చాలా ప్రేమ. పుత్రులలో శ్రీరాముడంటే ప్రేమ. కైకభవనంలో ఉండే దశరథుడు రాజ్యం చలాయించేవాడు. రాముడూ ఎక్కువగా అక్కడే ఉండేవాడు. ఒక్కొక్కప్పుడు కౌసల్య కూడా రామునితో అనేది "నీకు అసలుతల్లి కైకమ్మే" అని. కైకకూడా రాముడంటేనే తన కుమారునికంటె కూడా చాలా వాత్సల్యంతో ఉండేది. రాముడు భుజించకపోతే తాను భుజించేదే కాదు. రాముని రాజ్యాభిషేకవార్తను మంథర విన్పించినపుడు కైక అనే మాటలలో ఆమెకు రామునిపై ఎంత అనురాగం ఎంత వాత్సల్యం ఉందో స్పష్టమవుతుంది.

"పెద్దకొడుకు కన్నిటం బెద్ద పృథివి యేల
నర్హుఁడాతండ కాఁడె యేమనగనింక
నీ తోడను మాట లరయంగ నేర రాజు
తప్పు లేదిప్పగిది నొప్పు ధర్మువునను
రామునకు భరతుతోఁగల
యామంతన మాతడు భ్రాతయాన శిరమునం
బ్రాముకొనుట రసి నాతొలి
నోమనుకొని యిపుడు తిట్టనోరెట్లాడున్.
నాకు భరతుడెట్లు నాయన్న రాఘవ
రాముడట్లు రాము రాజ్యమెల్ల
భరతునిదె యటంచు బాటింతు నేనింత
కలుగ దొడర, రిత్త యడచిపడకు."

రామభరతులలో భేదం ఎన్నవద్దనికూడా మంథరను మందలించింది.

కాని మంధర 'రాజుమారిపోయినాడంది. భరతుని నగరంలో లేకుండా చేసి రామునకు రాజ్యాభిషేకం కట్టపెట్టు తున్నాడన్నది. ఇకనీగతి కౌసల్యకు దాసిపనిచేసేగతి' అన్నట్లుగా పలికింది. కైక దాది మాయమాటలకు లొంగిపోయింది.

ఆ సమయం అటువంటిది. కైక మారింది. ప్రారబ్ధం ఆమెను అట్లా ఆడించింది. దేవతల మాయ నెగ్గింది. కైక మనసు మారింది. రాము డరణ్యానికి వెళ్ళాడు.

భరతుడువచ్చి అంతా పరిశీలించాడు. రాజ్య స్వీకారం అతనికి ఏమాత్రం ఇష్టం కాదు. కైకను ఏమేమో అన్నాడు. కైకదోషం ఏమిటి? తనదగ్గరకు వచ్చినప్పుడు భరతునితో రాముడు కైకనుగూర్చి ఎంతగానో గౌరవంగా చెప్పాడు. కైకదోషం ఏమీ లేదని అన్నాడు. అంతా ప్రారబ్ధం. రాము డరణ్యవాసం నుంచి తిరిగిరాగానే ముందుగా కైకదగ్గరికే వచ్చాడు. కైకేయి సరళస్వభావం అంత మంచిది. కాని ఏమి చేస్తుంది. విధివిధానం ఆరీతిగా ఉంది. దేవకార్యం సఫలం కావడానికి కైక ఆధారమయింది.

కైక అంటే దశరథుడు అంతగా ఆదరించేవాడు. దశరథుడు అనుగ్రహంతో కైకకు రెండువరాలిచ్చాడు. ఇదొక పూర్వకథ. దశరథుడు ఒకసారి దేవతలపక్షాన ఉండి రాక్షసులతో యుద్ధంచేయవలసివచ్చింది. అపుడు రథంచీల ఊడిపోయింది. క్షణంలో దశరథుడు పడిపోయేవాడే. కాని కైక తనవేలును చీల ఉండవలసినచోట ఉంచి రథమును పడకుండా కాపాడింది. రాక్షసులు నశించారు. అపుడు కైకమ్మ శక్తి

సాహసాలకు రాజుగారు చాలా సంతోషించి - నీ యిష్టం వచ్చిన రెండు వరాలిస్తాను కోరుకొమ్మన్నాడు. సరే! నాకు కావలసినపుడు కోరుకుంటానన్నది. ఆమెలో ఏమీ కాపట్యం లేదు. ఈ సంగతి ఆమె ఎపుడో మరచి పోయింది. మంధర అంతా జ్ఞాపకంచేసింది. కైక మంధరమాటలు వింది. మారి పోయింది. కైకేయి పతిపరాయణ. "మీసేవ చాలు నాకు. మీరు వేరుగా వరాలివ్వవలెనా" ఈ విధంగా తలచేకైకకు పతిసేవకంటే వేరుగా ఏమీ కోరిక లేనేలేదు.

పట్టణమెంతో సుందరంగా ఉంది. వీధులు రాజ మార్గాలు అలంకరించారు. వాద్యాలు మోగుతున్నవి. పెద్ద ఉత్సవం ఆరంభమయింది. కైకేయిదాసి మంధర కైకేయి పుట్టింటినుండి వచ్చింది. ఇదంతా చూచి వ్యాకులపడింది. కైకకు ఏమేమో చెప్పింది. భావావేశానికి లొంగిపోయిన కైక దశరథుని వరాలడిగింది. దశరథుడేంచేస్తాడు. ఆనుహోరాజు కూ్కూడా రాముడు జన్మించింది మొదలు వేరొకలోకం లేదు. రాముడటువంటివాడు. ఆతనికి "యావరాజ్యాపట్టాభిషేకం చేయాలి" ఇదేఆలోచన. కేకయరాజుతో తానన్నమాటలు జ్ఞాపకానికి వచ్చిఉంటవి. కైకేయి కుమారుడు భరతుడు కేకయరాజుదగ్గరకు వెళ్లాడు. కేకయరాజ్యానికి పట్టాభిషేక వార్తను తెలియజేస్తే యెట్లావుంటుందో! తానిదివరలో కేకయరాజుతో ఏమేమో చెప్పాడు. ఇక అన్ని ఆలోచనలు మారిపోయినవి. రామాభిషేక మొక్కటే దృఢంగానిలబడింది. దశరథుడు ఎంతో మథనపడ్డాడు. గుండె రాయి చేసుకుని రామరాజ్యాభిషేకం తప్పదనుకున్నాడు. కైక కోపగృహంలో

ఉంది. ఇదేమిటో! ఆమె దుఃఖపడుతోంది. మంథర ఓదార్చుతోంది. మహారాజు దగ్గరకు వెళ్లాడు. ఈమెకోపం మానాలి. తానిస్తానన్న వరాలున్నవి. దగ్గరకు వెళ్లాడు. పుట్టలోనుండి రెండుపాములు వచ్చినట్లు కైకనుండి వరాలు వెలువడినవి. తానువరాలు ఎట్లా ఇవ్వననగలడు. రామునిపై ఒట్టుపెట్టుకుని కైకకు యిష్టం కూర్చుతానన్నాడు. రాముని అరణ్యానికి పంపాలి. భరతుడు యువరాజు కావాలి. ఈ మాటలు వినేటప్పటికి రాజు మూర్ఛపోయినాడు. తన ఇష్టం సిద్ధించకపోతే స్త్రీ ఎంతగానైనా కదిలిపోతుంది. కైకేయి పట్టుపట్టింది. రాముని పిలువనంపింది. స్వార్థసిద్ధికి రాముని పితృభక్తిని ప్రశంసచేసింది. రాముడు అరణ్యానికి పోవలసివచ్చింది.

కైకేయి ఓర్పుకలది. భరతుడు వచ్చిన తరువాత ఆమెలో యెంతో మార్పువచ్చింది. అసలు పవిత్రమైన కైక తాను తప్పుచేసినట్లు గుర్తించింది. రాముడు దేవకార్యానికై వచ్చాడనీ అతడు పరాత్పరుడనీ ఒకప్పుడు వశిష్ఠుని మాటల వలన తెలుసుకుంది. తన దోషానికి తానెంతగానో క్రుంగిపోయింది. భరతుడు పాదుకలు పట్టుకొనివచ్చాడు. కన్నీళ్ళతో అన్నాడు. అమ్మా! నీ అపరాధం ఏముందిలే. ఇదంతా దేవకార్యం. మంథరబుద్ధిలో దేవతలే తమ కార్యానికై ఆవక్రభావం కలుగజేశారు. కైకయే లేకపోతే రాముడరణ్యానికి వెళ్ళడం కుదరదు. దేవకార్యం సఫలంకాదు. కైక కేవలం నిమిత్తమాత్రమైనది. దీనిలో ఆమె అపరాధ మేముంది? ఈ విధంగా శ్రీరాముడుకూడ భావించాడు. వనవాసంనుండి రాగానే శ్రీరాముడు కైకేయినే దర్శించాడు. కైకేయి ధన్యు

రాలు. కైకనుగురించి కవులు చాలా విధాలుగా వ్రాశారు. ముగ్గురు తల్లులలో కైకేయి స్వరూపమే వేరు. అమె రామాయణంలో ప్రాణంలాంటిది. సీతారాములు అయోధ్యకు వచ్చినతరువాత వారి ఆనంద జీవనానికి కైకమ్మ దోహదం ఇచ్చింది. మహాకవులు కైకేయిని ఎంత రమ్యంగా భావించారో వినండి.

రానిరాము నడుగొ రాముడంచును బల్కు
కైక సీతపర్వాగములు పెట్టు
అడవికోడి కూసినట్లుగా నవ్వును
కైక, సీత తిరిగిరాక కలుగు.

మెలతను సీత గైక తన మేడలకుం గొనిపోయి మెచ్చు మే
రలుగ నలంకరింప యలరామునకుం బనియున్నయట్లు వా
ర్తలనిచి రామచంద్రుడును రా నొక పన్నకమాడి యిద్దరన్
గలియగ ద్రోసి నవ్వులనుగా గదితల్పులు మూసితీసెడున్.

సీతతోడ జెప్ప జెలది కైకయి యంద
గాడు తండ్రి నీవు కాదటంచు
రాముతోడ జెప్ప రమణ గైకయి యంద
కత్తె సీత నీవు కాదటంచు.

యజ్ఞఫలమనే నాటకంలో భాసకవి కైకేయిని చిత్రంగా చమత్కారంగా నిరూపించాడు. నలుగురు కుమారులలో గుణాధికుని కైక ప్రేమించుతుంది. ఆగుణాధికు డెవరు? "ఇప్పుడుచెప్పను. తగిన సమయంలో చెపుతా"నంటుంది కైక. రాజ్యాన్ని విభాగించి నలుగురికీ పంచవలసిందని వశిష్ఠుడన్నాడట. "ఇది వశిష్ఠుని వచనమైనాసరే. ఆప్తవచనంగా లేదు. ఇది ప్రమాణంకాదు. సామ్రాజ్యమును విభాగించకూడదు" అంటుంది కైక. యోగ్యతమునకు రాజ్యమంతా ఇమ్మంటుంది

"భరతునకు రాజ్యమిచ్చేదా!" అంటాడు దశరథుడు "పుత్రునకు రాజ్యం వచ్చినంత మాత్రాన స్త్రీకి సంతోషం కలుగదు" అంటుంది కైక. "రాముడే రాజ్యార్హుడు" అని స్పష్టంగా కైక చెప్పింది. "రాముడు భూరక్షణాని కైజన్మించాడు. రామునికే రాజ్యమివ్వాలి. రామునకు రాజ్యమిస్తే భరతునకూ రాజ్యమిచ్చిన సంతోషం నాకూ ఉంటుంది". అని ఖండితంగా చెప్పింది. ఈ మాటలనగానే కౌసల్యా, సుమిత్రా ఇద్దరూ మాసోదరి "మహానుభావ," "నీతిజ్ఞ" అని మెచ్చుకుంటారు.

రామాయణకథలో కైకేయీ స్వభావమును బాగా భావించిన కవులు కైకేయిని రమ్యంగా ధీరముగా వర్ణించారు దశరథుడున్న కైకేయీ అంతఃపురమునకు పిలువనంపగా వచ్చిన శ్రీరాముడు కైకేయిని గౌతముని ధర్మపత్ని అహల్యను ఆరాధించినట్లుగా ఆరాధిస్తూ ఉంటాడు. రాముడు వచ్చినప్పటికీ కైకేయీ అంతఃపురములో దశరథుడు మాడలేడు. అది రామునకు బాధగా ఉంది. తండ్రి యీవిధంగా ఉన్నాడేమి? అదిరాము డడిగాడు. కైక ఎంత చక్కగా అంటున్నదో వినండి.

అవునోయీ రాఘవుడ పి
తృవాక్య పరిపాలనంబు దెప్పరమై పా
ల్య విధం గొప్పరమా వ్రత
మునినయులను జేతగాని దగు వ్రతముసుమీ!
అది నీవు చేయగలవా
మొదలిడి పట్టాభిషేకమునకును యువరా
ట్పదమునకు సిద్ధపడితివి
మది నాల్లోకించి బదులుమాట్లాడు మనన్.

ఆమాట వినగానే రాముడు అహల్య తనకు గురూపదేశంగా చెప్పిన మాటలను గుర్తుకు తెచ్చుకున్నాడు. కైక అంటుందీ "మా ముప్పురు రాణులకును స్వామీ పుత్రకులు మీరు జన్మింతురటంచేమో ఎరుగుదునెప్పుడో యీ మంచి యనేహ మెంచి ఇట్టులు సేయన్". రాముడవతరిస్తాడనీ రక్షోజాతిని నాశనం చేస్తాడని కైక ఎంతగానో భావించి కార్యనిశ్చయము పూనింది.

భరతుడు ముగ్గురు తల్లులను వెంటబెట్టుకొని రామ దర్శనార్థమై వెళుతూ భరద్వాజుని ఆశ్రమంలో విడిది చేశాడు. ముప్పురురాణులూ వచ్చి ముని పాదపూజకై సిద్ధమయినారు. "వీరెవ్వరెవ్వారు?" అని భరద్వాజు డడిగితే భరతుడు కౌసల్యనూ సుమిత్రనూ చెప్పినాడే కాని కైకేయిని చూచీచూడకుండా మాటలాడకుండా ఊరుకున్నాడు. మునికి నవ్వు వచ్చింది. ఆయన కంతా తెలిసింది. కైకేయి ఎట్టిదో భరద్వాజమహర్షి స్వయంగా ఇట్లా అంటాడు.

అమర సాహాయ్యార్థమఃగినయెడ దశ
రథ భూమి పాలు సారథియు దాను
క్ష్మానీతి సంక్లిశ్య మానార్థముల వేళ
మహిపాలుని రహస్యమంత్రి తాను
శ్రీరఘురాముని చిత్రధనుఃకళా
ధృతిహేతునూత్న గాధఋషి తాను
సర్వదైవతఋషి సంతానకార్యసం
ఘాతశ్రీ సంధానకర్త్రి తాను
తనను బెంచిన ఋణముతీర్పను హృదంత
రాంతరప్రాణమగు బిడ్డ నడవికంపె
మంధరప్రార్థనము బొంటె మగువ కైక
ఆమె నీకు గౌరవనీయురాలు కాదె.

తాను గొప్పతప్పు చేసినట్లు భావించి భరతుడు తనను ఇంతగా చిన్నబుచ్చాడు. తానుచేసిందికూడ దోషమేఅని కైకేయి ఎంతగానో బాధపడింది. ఆమె హృదయబాధ తగ్గించడానికి ముని అసలువిషయమును చెప్పి కైకను ఒదార్చుతాడు.

ఓయమ్మ యెందుకమ్మా
ఈ యేడుపు నీవు కోరితెది యది నీవై
చేయుట కాదే దేవత
లాయెడ నీయెడద నట్టులాడిరిగాకన్.

సకలము కర్మాధీనము
సకలము నియమితఫలంబు చానా! ఇది యే
రికి తెలియబోవ దవ్వా
రికి మాత్రము నీకృతి విపరీతార్థమగున్.

ముగ్గురు తల్లులలో కౌసల్యాసుమిత్రలను తెలుసు కొనడం కష్టంకాదు. వారి విషయమంతా వారి చరిత్రలో స్పష్టంగా ఉంది. కైకేయీ విషయం బాగాభావించేతేనే గాని తెలియదంటారు పెద్దలు.



## ౪ సంస్కృతకవయిత్రులు - త్రివేణి

స్త్రీలుకూడా పురుషులమాదిరి కవిత్వం చెప్ప గలుగు తారు. కావ్యములు రచనచేస్తారు. విమర్శచేస్తారు. తెలుసు కొంటారు. కవిత్వము చెప్పడమనేది ఆత్మసంస్కారము. స్త్రీల సంస్కారమనీ పురుషులసంస్కారమనీ విభేదమేమీ ఉండదు. తగిన అవకాశాలు, సౌకర్యాలు, సదుపాయాలు ఉంటే ఎవ రైనా కావ్యాలు రచింపగలరు. పూర్వకాలంలో రాజ

కుమారికలు, మంత్రుల కన్యకలు, దేవదాసీలు మొదలయిన వారు శాస్త్రాలు చదివి వివేకము సంపాదించారని కవిత్వాలు చెప్పినారని పెద్దలంటున్నారు. నేటికిన్నీ అటువంటివారున్నారు

చాలామంది స్త్రీలు సంస్కృతంలో కవిత్వం చెప్పారు. కావ్యరచన చేశారు. వారందరి రచనలు నేడు కనబడడం లేదు. అయితే వారి ప్రశంసలు చాలా ఉన్నవి. వారి కవితలు రమ్యంగా ఉండి ఉండాలి. అందుకనే వారు కవయిత్రులుగా ప్రసిద్ధి సంపాదించారు. శీలాభట్టారిక, విజ్జిక, మోరిక, అవంతిసుందరి, నాగమ మొదలైనవారు చాలామంది ఉన్నారు దక్షిణ భారతదేశాన ప్రభువులు సారస్వత పోషకులుగా ఉన్నప్పుడు కవయిత్రులు సంస్కృతంలో కూడా కావ్యాలు వ్రాశారు.

త్రివేణి అనే సంస్కృతకవయిత్రి ఆంధ్రవనిత. ఈమె తండ్రి ఉదయేంద్రపురము అనంతాచార్యులు. త్రివేణి ఇప్పటికి వంద సంవత్సరాలకు పూర్వం జీవించి ఉన్నదట. తండ్రి వద్దనే చక్కగా కావ్యనాటకాలంకార గ్రంథాలు చదివింది. గొప్ప విద్వాంసురాలయింది. కవిత్వంలో నైపుణ్యం సంపాదించింది. తండ్రి కేవలము విద్వాంసుడు కాడు. గొప్పకవి. యాదవరాఘవపాండవీయము అనే మూడు అర్థాలు వచ్చే కావ్యము వ్రాశాడట. తన కూతురుకు తన పాండిత్యమును కవిత్వమును అలవరచాడు. ఇటువంటి భాగ్యము ఏకొందరికో లభిస్తుంది.

త్రివేణి పెరంబూరునివాసి అయిన ప్రతివాది భయంకరం వెంకటాచార్యులు భార్య అయింది. తన పాండిత్యమును

కవిత్వమును అభినందించగల భర్త లభించడము త్రివేణి భాగ్యము. భర్త సమీపంలో వేదాంతశాస్త్రము చదివింది. తత్వజ్ఞానము సంపాదించింది. పెండ్లి కాక పూర్వము తండ్రివద్ద పెండ్లి అయిన తరువాత భర్తవద్ద జీవితమునకు కావలసిన విశేషాలను అన్నిటిని త్రివేణి సంపాదించగలిగింది. చిన్నతనంలో తండ్రి, యువతిగా ఉన్నప్పుడు భర్త ఆశ్రయంగా ఉండాలని వారివద్ద తాను అవసరములయినవానిని చదివి తెలుసుకోవాలని ప్రసిద్ధమయిన వంశాచారమును త్రివేణి బాగా అనుసరించింది.

ఈ త్రివేణి సంస్కృతకవయిత్రిగా ప్రసిద్ధురాలయింది. రంగనాథసహస్రము, లక్ష్మీసహస్రము, శ్రీరంగాభ్యుదయము, సంపత్కుమార విజయము, రంగరాట్సముదయము, తత్వముద్రాభద్రోదయము, శుకసందేశము, భృంగ సందేశము మొదలయిన పెక్కు కావ్యాలు వ్రాసింది. ఈ కావ్యాలు యింకా అచ్చుపడలేదు. తంజావూరు సరస్వతీ భాండాగారములో యీమె గ్రంథాలున్నవి. అవి ఎవరైనా ముద్రించితే త్రివేణీ ప్రతిభ బాగా తెలుస్తుంది.

త్రివేణికి శ్రీరంగనాథస్వామి యిష్టదైవము తాను వైష్ణవధర్మాసక్తురాలుగదా! ఆ దేవుని స్తుతించుచూ వేయి శ్లోకాలు వ్రాసింది. వేంకటాధ్వరి అనే ఒక సంస్కృత కవి లక్ష్మీసహస్రమని లక్ష్మీస్తుతిగా వేయి శ్లోకాల గ్రంథము రచించాడు. ఆగ్రంథాన్ని పండితులు కవులు చాలా ప్రశంసలు చేశారు. శ్లేషాలంకారములు దానిలో విరివిగా ఉన్నవి. శబ్దచిత్రము అధికముగా ఉంటుంది. తనకావ్యముకూడా ఆవిధ

ముగా ఉండాలని త్రివేణియత్నము. వేంకటాధ్వరి లక్ష్మీసహస్రమును అనుకరించడమైనా ఎంతో ప్రజ్ఞగలవారికిగానిసాధ్యము కాదు. త్రివేణి గొప్పవిదుషీమణి. లక్ష్మీసహస్రమన్న పేరుతో తాను వ్రాసిన కావ్యముకూడా యిలాగే ఉంటుందని మనం నిశ్చయించాలి. రంగాభ్యుదయమనేది చంపూకావ్యము అని ఆంధ్రకవయిత్రులు గ్రంథములో ఉన్నది. అది చంపూ కావ్యము గద్యపద్యములతో కూడిన స్వతంత్ర కావ్యము. ఈ కావ్యము సద్బృందవంద్యమైన మహాకావ్యము ఆమ్నాయమువలె మధురమయినదని ఆశ్వాసాంత శ్లోకాలలో త్రివేణి స్వయంగా చెప్పింది. ఆమె అంతగా ఆత్మవిశ్వాసముగల కవయిత్రి అన్నమాట.

తత్త్వముద్రాభద్రోదయమని త్రివేణి వేదాంతకావ్యము వ్రాసింది. తమ వారందరూ అటూ యిటూ వైష్ణవులు కాబట్టి విశిష్టాద్వైతమత సంప్రదాయ వేదాంతమును నిరూపించుతూ తన భర్త సమక్షంలో తెలుసుకున్న వేదాంత విద్యను తత్త్వజ్ఞానమును సార్థకం చేసింది. వేదాంతగ్రంథాలు కవిత్వాలద్వారా లోకంలో బాగా ప్రకటముగావాలి, సంకల్పసూర్యోదయమనే వేదాంతదేశికుడు వ్రాసిన గ్రంథానికి యిది అనుకరణమే అయినప్పటికీ అందరూ అభిమానించవలసిన గ్రంథం.

శుకసందేశము, భృంగసందేశమనే రెండు కావ్యాలున్నా కాళిదాసుని మేఘసందేశము వంటివి. మేఘసందేశమును అనుకరించిన సందేశకావ్యములు సంస్కృతములో దాదాపు నలభైదాకా ఉన్నవి. వానిలో వీనినికూడా చేర్చ

వచ్చు. వేదాంత దేశికుడు హంససందేశమనే కావ్యమును వ్రాస్తే త్రివేణి ఈ రెండు సందేశ కావ్యాలు వ్రాసింది. విశిష్టాద్వైతమతమును శ్రోత్రియంగా ప్రామాణికముగా వ్యాపింప చేసిన వేదాంత దేశికుడు సర్వవిధాలా సమర్థుడైన మహా శ్రీవైష్ణవుడు. తాను అట్టి శ్రీవైష్ణవసంప్రదాయములో మెలగినదికాబట్టి త్రివేణి ఆ దేశికుల కవితామార్గమును, వేదాంత మార్గమును అంతటా అనుసరించి కవయిత్రిగా రాణించింది. ఇంకా ఈమెకృతులు చాలా ఉండి ఉండాలి. అవన్నీ ఎప్పటికి తెలుసుకోగలమో.

త్రివేణి శ్రీరంగనాథుని సేవించుతూ తన జీవితమంతా గడిపింది. ఆమె ధన్యురాలు. మైసూరు మొదలైన సంస్థానములలో యీమెకు తగిన సమ్మానములు. సత్కారములు చక్కగా జరిగినవట. తనకావిధంగా లభించిన ద్రవ్యమును శ్రీరంగని సేవాకైంకర్యాలకై వినియోగించింది. ఈ విషయమును కవులు, కవయిత్రులు బాగా గుర్తుపెట్టుకొనవలసినదే. శ్రీరంగనాథస్వామి యనుగ్రహమువలన తనకు కవిత్వము, తత్వబోధ లభించగా నానాగ్రంథాలు వ్రాసిందిగదా. వాని ద్వారా ద్రవ్యములాభించితే అది శ్రీ స్వామివారి దేనని మహా కవయిత్రి త్రివేణి మాత్రమే భావించగలిగింది.

తన జీవితమును ధర్మబద్ధముగా తీర్చికొని పవిత్రముగా ధన్యముగా సాగించిన త్రివేణి సంస్కృత కవయిత్రులలో ఆదర్శవనిత. ఆమె గ్రంథాలు ముద్రితములై లోకమునకు అందడము చాలా అవసరము.

యస్యభార్యా శుచిర్దక్షా
భర్తార మనుగామినీ
నిత్యం మధుర వక్త్రీచ
సా రమా, న రమా రమా.

భార్య శుచి భావముకలది సమర్థురాలు భర్తను అనుసరించేది నిత్యమూవిద్యావివేకాలు కలిగి మధుర భాషిణి అయితే ఆమె సాక్షాత్తు రమ, రమ రమకాదు. అని పెద్దలంటారు. ఇదంతా త్రివేణివిషయంలో బాగా సమన్వయిస్తుంది.

ఉపదిశతిహి కామినీనాం
విద్యావిశేష ఏవ లలితాని.

స్త్రీలకు విద్యావిశేషము ఎంతటి రమ్యతనయినా సంపాదిస్తుందిట. మహాకవి కాళిదాసు.

స్త్రీణా మశిక్షిత పటుత్వ మమానుషీషు
సంధృశ్యతే కిముత యాః ప్రతిబోధవత్యః.

అన్నాడు. స్త్రీ ప్రాణులకు ఏమీ శిక్షణములేకుండానే మంచి సామర్థ్యం ఉంటుంది. ఇంకా సరిగా శిక్షణము బోధ ఉంటే చాలా వివేక విజ్ఞానములు లభించుతవట.

★★★★

## ౫. ప్రాచీనసాహితి :
## జైనసాహిత్యములో స్త్రీల పరిస్థితి

భారత దేశములో ప్రతిమతమువారు కొంత సాహిత్యము వ్రాసుకున్నారు. ప్రాచీనకాలంలో మతముపై శ్రద్ధ కలిగి గ్రంథాలు వ్రాశారు. జైనమతము వారు కూడ ఎన్నో వ్రాసి ఉంటారు. మన తెలుగు వాఙ్మయములో జైనసాహి

త్యము ఎంతగా ఉన్నదో బాగా తెలియడంలేదు. ఏమైనా అటువంటివిఉన్నా ఇపుడు మనకు లభించడము లేదు.

దేశభాషలలో పాళి ప్రాకృత భాషలు జనుల భాషలుగా ప్రసిద్ధిపొందినవి. జైనమతమువారు ముఖ్యముగా ప్రాకృతభాషలోనే తమ గ్రంథాలు వ్రాశారట. సంస్కృతములో కొన్ని ఉన్నప్పటికి జైనమతమువారు ప్రాకృతములోనే చాలా గ్రంథాలు వ్రాసుకున్నారు. ఉత్తరదేశాన ప్రాకృత సంబంధం కలిగిన భాషలవాళ్ళు తమతమ భాషలలో కొంతగా జైనమతాన్ని నిరూపించుకున్నారు. గుజరాతు దేశములో గుజరాతి భాషలో చాలా జైనవాఙ్మయము ఉన్నది. మన తెలుగు దేశములో కూడ ఆ విధముగానే వ్యాపించి ఉండాలి.

జైనమతము రెండుశాఖలుగ ఉన్నది. దిగంబరజైనము శ్వేతాంబరజైనము అని జైన ధర్మమును ప్రచారముచేసే వారిని తీర్థంకరులు అంటారు. మొదటి తీర్థంకరుడు వృషభదేవుడు. చివరి తీర్థంకరుడు మహావీరుడు. మహావీరుడే జైనమతాన్ని ప్రవర్తింపజేసిన మహనీయుడు. మహావీరుని తల్లి పేరు త్రిశలాదేవి. తనకు పెళ్ళిఅక్కరలేదని మొదటలో మహావీరుడు చాలా పట్టుదలగ ఉండేవాడట. తల్లి త్రిశలాదేవి కుమారుని బ్రతిమలాడి ఒప్పించి పెళ్ళిచేసినది. మహావీరుని భార్య పేరు యశోద. కూతురు ప్రియదర్శిక. మహావీరుని సమయంలో అన్నివర్ణములవారు జైనమతమును స్వీకరించారు. మహావీరుడు స్త్రీలకుకూడ పురుషులకువలె ధర్మాధికారము ఇచ్చాడు. అప్పటినుండి అన్నివర్ణాల స్త్రీలున్నూ జినధర్మ

దీక్షను తీసుకొనేవారు. దిగంబరజైనమతములో నియమాలు కఠినంగా ఉంటవి. స్త్రీలు అంత కఠోర నియమాలను పాటించ లేకపోయినారేమో! ఏమైతేనేమి స్త్రీలకు మోక్షములేదని పురుషజన్మము వస్తేనే మోక్షము ఉంటుందని అన్నారు అందువలన స్త్రీలు పురుషులను అనుసరిస్తూ వారి యిష్టాను సారముగా ఉండవలసి వచ్చినది. అందువలననే కాబోలు మహావీరుడి అల్లుడు మామగారిమతముకంటె మరొక్కమత మునుకూడ తనభార్య అభిప్రాయమును కలుపుకుంటూ వ్యాపింపచేశాడట.

శ్వేతాంబరజైనమతములో ఆడవాళ్ళనుగురించి చాల వెక్కిరింపుగా వ్రాశారు. కామిని జాలములో పడి యతు లందరు నానాదురవస్థలకు పాల్పడ్డారట. స్త్రీల ప్రవృత్తి చాలా హాస్యప్రాయమైనది. జైనమతములో ముఖ్యులైన వాళ్ళందరు ఏదోవిధంగా స్త్రీలను నిందించుతూనే వచ్చారు. దిగంబరజైనులు శ్వేతాంబరజైనులు శక్తిపూజ చేస్తారు, స్త్రీరూపంగా దేవతను భావించడం, దేవతారూపంగా స్త్రీని భావించడం చాలా మతాల్లో ఉండనే ఉన్నది.

యక్షిణి, యోగిని, శాసనదేవి మొదలైన పేర్లతో స్త్రీలకు దేవతారూపంగా జైనమతము ఒక గౌరవము ఇచ్చింది. ఈ విషయములో చాల గ్రంథాలను జైనులు వ్రాసు కున్నారట.

జ్ఞాత ధర్మకథ అనే పుస్తకములో మల్లి అనే తీర్థంకరు డున్నాడు. ఈ తీర్థంకరుడు పురుషుడని దిగంబర జైనులంటారు. కాదు మల్లి స్త్రీ దేవత అని శ్వేతాంబర జైనులంటారు. మల్లి

వివాహము చాల విశదముగ పెద్ద కథలో వర్ణించారు. మల్లికై వివాహము నిశ్చయించారు. నేను-నేను అంటూ చాలమంది పురుషులు మల్లిని పెళ్ళి చేసుకొనుటకు వచ్చారు. కాని మల్లి ఒప్పుకోలేదు. తనను వివాహమాడటానికి వచ్చిన పురుషుల నందరిని చూచింది. వీళ్ళ జీవనము ఇంత నిస్సారముగా ఉన్నది కదా! పురుషునితో సంసారజీవనం ఎలా కుదురుతుందని ఈమె తలచినది. ఈ కథ చాల పెద్దదిగా ఆ వాఙ్మయములో నున్నది.

కొంతమంది స్త్రీలు భిక్షుణీరూపంగా దేశంలో సంచరించేవారు. ధర్మబోధ చేసేవారు. దేశ దేశాలు తిరిగేవారు. అటువంటి స్త్రీలకు చాల వ్రతములు, ఆచారాలు, ఉపవాసములు ఎన్నో ఉన్నవి. వారి నడవడిలో ఏమైనా పొరపాటు వస్తే తగిన ప్రాయశ్చిత్తం కూడ ఉందట. ఈ భిక్షుణీస్త్రీలు కొన్నికొన్నిచోట్ల బాగా గౌరవం పొందేవారు. ఇప్పటికి ౧300 సంవత్సరముల క్రిందట హర్షవర్ధనుడు రాజ్యమేలేటప్పుడు రాజ్యశ్రీ అనే ఆమె కొన్ని వేలమందిని ధర్మ ప్రచారానికై నియమించిందట. వారిలో జైన బౌద్ధ ధర్మములను వర్ణాశ్రమ ధర్మములను బోధించేవారుకూడా ఉండేవారట. జైనధర్మమును బోధించడానికిన్నీ చాలామంది భిక్షుణీ సంఘములో చేరేవారు. కొంతకొంతమంది జైనధర్మములో స్త్రీలు రాజుల అంతఃపురములలో చేరి అక్కడ స్త్రీలకు ధర్మోపదేశాలు చేస్తూ ఉండేవారు. దండి వ్రాసిన దశకుమార చరితములో కొంతమందిస్త్రీలు తగిన స్థానగౌరవము ఉండి లేక కూడ రాజసంఘములలోను- ఇంకా ఇతర ప్రదేశాలలోను సంచరించినట్లు కనబడుతోంది.

తెలుగు దేశంలో కొంతకాలము క్రిందట ఏకవీర అనే దేవతను ఆరాధించేవారు. ఇప్పటికీ కొన్నిచోట్ల ఉండవచ్చు. "కాకతమ్మకు సైదోడు ఏకవీర" అని శ్రీనాథుడు వర్ణించాడు ఈ దేవతను రేణుకాదేవి అంటారు. ఈ దేవత వస్త్రము లేకుండా ఉంటుందిట. "వ్రీడాశూన్య కటీరమండలము దేవీ శంభళీవ్రాతమున్" అని శ్రీనాథుడు అన్నాడు. ఈనగ్నత్వం జైనసంప్రదాయమునుండి వచ్చి ఉండవచ్చునని ప్రతాపరెడ్డిగారు అన్నారు. అట్లాగే ఎల్లమ్మ అని ఇంకో దేవత. ఈమెకే జోగులాంబ అని పేరు. ఈమె మొదట జైనదేవత. పంచముల స్త్రీలు ఎల్లమ్మ దేవతను వీరావేశంతో చెప్పుతుంటారు. "జుకజుంజుం జుకజుంజు జుమ్మనుచున్ సాగున్ కడున్ వాద్యముల్" ఇటువంటి వాద్యవిశేషాలు జైనమతమున అవలంబించేవారు. స్వీకరించేవారు. కాకతీయులు జైనులుగా నుండినపుడు చాల జైనదేవాలయాలు కట్టించారు. అవన్నీ తరువాతికాలంలో చెడిపోయినవి. తెలుగుదేశంలో జైనమతం కొంత మారిపోయింది. కొంత శైవములో కలిసిపోయింది.

గుజరాతు దేశములో జైనధర్మమును బోధించడానికి చాల కథలు చెప్పారు. తరంగవతి అనేది ఆ కథల్లో ఒకటి. మగధదేశంలో ఒక జైనభిక్షుకి బిచ్చానికై వెళ్ళింది. ఒక వైశ్యుడామెను చూచి "నీవు బిచ్చగత్తెవు ఎందుకయినావు?:-" ఆమె తనకథ చెప్పుతుంది. తానొక వైశ్యుని కూతురు. బాగా చదువుకున్నది. బాగా పెరిగింది. ఒకనాడు తోటలోకి పోయింది. అక్కడ చక్రవాకపు పిట్టలను చూచి మూర్ఛపోయింది. నీవెందుకు మూర్ఛపోయినావు? అని చెలి

క త్తెలడిగారు. తరంగవతి తన పూర్వజన్మకథనంతా చెపు తుంది. పూర్వజన్మలో తానొక చక్రవాకి. తన ప్రియునితో సరస్సులో విహరించేది. ఒకనాడు కిరాతుని బాణము మగచక్ర వాకానికి తగిలింది. అది చచ్చిపోయింది. చక్రవాకి అయిన తనకు చాలా దుఃఖంవచ్చింది. అగ్నిలోదూకి దగ్ధమయినది. ఈ జన్మలో తరంగవతిగా వచ్చినది. ఇప్పుడీ చక్రవాకమిథునం చూడగానే తనకు పూర్వకథంతా గుర్తుకురాగా మూర్ఛ వచ్చింది అని అన్నది, పూర్వజన్మలో తనభర్తను వెతుక్కోవా లని బుద్ధిపుట్టి ఎంతో యత్నం చేసింది. చిత్రాలువ్రాసి వృత్తాం తములు ప్రకటించేది. ఆ మగచక్రవాకం ఆ పట్టణంలోనే వైశ్య కుమారుడుగా పుట్టింది. అతడా బొమ్మలుచూచి మూర్ఛపోయి నాడు. తరంగవతి వైశ్యకుమారుడు కలుసుకున్నారు. వారితల్లి దండ్రులు వారిపెళ్ళికి ఒప్పుకోలేదు. అందువలన వారిద్దరూ అడవిలోకి వెళ్ళారు. ఒక దొంగలగుంపు వారిని పట్టుకుని బలిఇవ్వడానికి తీసికొనిపోయినారు. ఆదొంగలలో ఒకడు వారి కథవిని మగపక్షిని చంపిన కిరాతుడు తానేనని తెలుసుకొని వారు తప్పించుకుని పోవడానికి ఉపాయం చెప్పాడు. వారా దొంగలగుంపు విడిచిపెట్టి పారిపోయారు. పట్టణం చేరుకున్నారు వారి పెద్దలు వారికి పెళ్ళిచేశారు. ఈ కథంతా చాలా రమ్యంగా ఉంది.

హేమచంద్రుడనే విద్వాంసుడు గుజరాతు దేశంలో జన్మించాడు. చాలగ్రంథాలు వ్రాశాడు. ఆయన శిష్యుడు రామ చంద్రుడనే వాడు కౌముదీమిత్రానందము అనే నాటకము వ్రాశాడు. అది చాలాబాగా ఉంటుంది. మిత్రానందుడు అనే

ఒక వైశ్యుడు సముద్రప్రయాణంచేస్తూ ఒక ద్వీపానికి వెళ్లాడు. అక్కడ ఒక దొంగలనాయకుడు సాధువేషంలో ఉంటాడు. మార్గవశాన వచ్చిన వారిని తన యింటికి తీసుక వెళ్తాడు. అందులో గొప్పవారిని తనకూతురు కౌముది అనే పిల్ల దగ్గరకు పంపిస్తాడు. అప్పుడు వాళ్ళను పట్టుకుని ధనమంతా దొంగిలిస్తాడు. మిత్రానందుడుకూడ యిట్లాగే అయినాడు కాని కౌముది మిత్రానందుని బాగా ప్రేమించి తన తండ్రికుట్రనంతా చెప్పింది. ఆ స్థలము విడిచిపెట్టి యిద్దరు పారిపోతారు. ఒకచోట ఒక మంత్రి కౌముదిని తానే స్వీకరించాలని మిత్రానందుని ఎచటకో పంపిస్తాడు. కౌముదికి ఈ కుట్ర తెలిసి చాల కష్టాలుపడి మిత్రానందునివద్దకు చేరుతుంది. కౌముదీ మిత్రానందుల సంభాషణములలో "నాస్వభావము తెలియదుకదా! నన్నెందుకు ప్రేమిస్తున్నావు?" అని మిత్రానందు డడిగితే కౌముది ఈ విధంగా అంటుంది "ఆర్యపుత్రా! స్త్రీలందరూ యిట్లే చేస్తారు. నా నడవడిక నీకు ఆశ్చర్యంగా ఉందా? ప్రేమకల స్త్రీలు తాము ప్రేమించిన ప్రియులకోసం యెంతైనా త్యాగం చేస్తారు" అని అంటుంది. జైనసాధువులు చాల కథలు వ్రాశారు. అన్నీ ప్రాకృత భాషలోనే ఉన్నవి. జైన సాహిత్యములో స్త్రీలను చాలా విధాల ఉపయోగించుకున్నారు. వాళ్ళ మతప్రచారమునకు స్త్రీలు ఎంతెంతగానో త్యాగం చేసినారు. ఎన్ని అపవాదులొచ్చినా ఎన్నికష్టాలు వచ్చినా జైనసాహిత్యములో స్త్రీలు తాము నమ్మిన విషయంలో చాల పట్టుదలగా ఉన్నారని చెప్పవచ్చును. భిక్షుణిగణముగ సంచరించినవారు ధర్మసేవకు సంఘసేవకు యెంతో

ఉపకరించారు. అక్కడక్కడ జైనులు విహారములలో ఉంటూ పట్టణాలలో గూఢంగా ప్రవేశించి రాజకీయ రహస్యాలుకూడ తెలుసుకొనేవారు. నాయికా నాయకులకు సహకరించి ఉపకారము చేసేవారు. చాల కథలలో స్త్రీలు ఎంతెంతగానో విశేషమును సంపాదించి కన్పించుతారు.



## - ప్రేమ స్వరూపిణి - రాధ

"రాధా కరావచిత పల్లవ వల్లరీకే
రాధా పదాంక విలసన్మధురస్థలీకే
రాధా యశోముఖరమత్తఖగావలీకే
రాధా విహార విపినే రమతాంమనోమే".

బృందావనంలో రాధ చిగురుటాకులు కోసింది. రాధ బృందావన ప్రదేశాలను పాదపరాగములతో పవిత్రంచేసింది. బృందావనంలో పక్షులన్నీ రాధా యశస్సును గానంచేస్తూ ఉంటవి. ఆ రాధ విహరించిన బృందావనంలో నా మనస్సు విహరించాలి.

రాసేశ్వరి అయిన రాధాదేవిని గురించి భక్తులు పై విధంగా భావిస్తారు. భాగవతంలో రాధనుగురించి ఏమీ స్పష్టంగా లేదు. మిగతా పురాణాలన్నిటిలోనూ రాధాచరిత్ర ఉన్నదని పెద్దలంటారు. ఇన్నిటిలో ఉండి భాగవతంలో ఎందుకులేదు? అసలు లేకపోలేదు. గూఢంగాఉంది. రాధపేరు లేకుండా ఉండవలసిన రాధాలీల అంతా ఉన్నది.

ఒకప్పుడు గోలోకంలో శ్రీకృష్ణుడు రాసమండల విహారం చేయాలనుకున్నాడు. కుడి భాగము కృష్ణుడుగా వామ

భాగము రాధగా అయింది. రాధాకృష్ణులు రాసమండల విహారం చేశారు. రాధాశరీరమునుండి గోపికలు ఆవిర్భవించారు కృష్ణ దేహమునుండి గోపాలకులు జన్మించారు. భగవానుని దివ్యశక్తికి రాధ అనిపేరు. రాధ, దుర్గ, లక్ష్మి, సరస్వతి. సావిత్రి, దేవి అన్నీ ఆశక్తికే పేర్లు. రాధాదేవి అంశమె మహాలక్ష్మి. ఆమె గృహలక్ష్మి.

ఒకసారి కృష్ణుడు రాధకు తెలియకుండా విరజ అనే గోపికతో విహరిస్తున్నట్లుగా నలుగురు చెలికత్తెలు రాధకు చెప్పారు. అది రాధ సహించలేక రథమెక్కి బయలుదేరింది. కృష్ణునిదగ్గర ఉండే సుదాముడు ఈ కోలాహలం తెలుసుకుని కృష్ణునికి తెలియచెప్పి ఎక్కడికో వెళ్ళాడు. కృష్ణుడుకూడా విరజను అక్కడవిడిచి మాయమయినాడు. గోలోకంలో విరజాదేవి నదిగా మారిపోయింది. రాధ వచ్చి చూచింది. ఎవరూ కనపడలేదు. ఏమి చేస్తుంది? ; మళ్ళీ ఇంటికి వెళ్ళింది. ద్వారపాలకులు నిషేధిస్తూ ఉన్నా లక్ష్యపెట్టక కృష్ణుడు రాధ దగ్గరకు వచ్చాడు. రాధ రుసరుసలాడింది. సుదాముడు "నీకిది తగదు" అన్నాడు. రాధకు కోపంవచ్చి "నీవు రాక్షసుడుగా జన్మిస్తావు" అని శపించింది. "నీవు భారతదేశంలో జన్మించు. వంద సంవత్సరాలు కృష్ణవిరహం అనుభవించు" అని సుదాముడు రాధను శపించాడు.

రాధ గోలోకంవిడిచి భూలోకానికి వచ్చి వృషభానుడు అనే వైశ్యునకు కన్యకగా జన్మించింది. జన్మించింది అంటే కలావతీ వృషభాను దంపతులకు ఆవిర్భవించింది అని తెలుసుకోవాలి.

రాధకు పండ్రెండు సంవత్సరాల వయస్సుతో నవయౌవనం వచ్చింది. రాయణుడు అనే వైశ్యునితో సంబంధం నిశ్చయించుకున్నారు. రాధ తన ఛాయను గృహంలో ఉంచి అంతర్ధానమయింది. రాధాఛాయతో రాయణునకు పెళ్ళి అయింది. అంతే. రాధకు పద్నాలుగు సంవత్సరాలు వచ్చిన తరువాత కృష్ణుడు శిశువుగా లోకానికి అవతరించాడు. యశోదకు రాయణుడు వరసకు సోదరుడు అవుతాడు. కృష్ణునకు మామ అయినాడు. ఇక రాధ అత్త అయినట్టేగా! అసలు రాధకు కృష్ణునకు బృందావనంలో బ్రహ్మవచ్చి వివాహం చేశాడు. ఛాయారాధ రాయణ మందిరంలో ఉండేది.

అసలు రాధ సంగతి ఎవరికీ తెలియదు. "రాయణ రాధ కృష్ణుడు దగ్గరకు వస్తోంది" అని లోకం అనుకునేది. భక్తులు రాధాకృష్ణ యుగళమును ధ్యానిస్తారు. కేవలరాధ సగమురాధ. కేవల కృష్ణుడు సగము కృష్ణుడు. రాధాకృష్ణుల దివ్యలీల ప్రేమస్వరూపము. దివ్యలోకములోనివారి లీలకున్నూ భూలోకములోని లీలకూ చాలా భేదంఉంది. సుదాముని శాపప్రభావముతో భూలోకలీల ఉంటుంది, రాధాకృష్ణుల భూలోకములోని లీలను భక్తులు బృందావనలీలగా వర్ణించారు. ఈ లీలావిహారము నాలుగురకాలు. గోష్ఠలీల, వనలీల, కుంజలీల, నికుంజలీల అని. నాల్గవది అయిన నికుంజలీలలో రాధాకృష్ణులకు తప్ప ఇతరులకు ఎవరికీ ప్రవేశం ఉండదు. గోష్ఠలీలలో వ్రేపల్లెలోని వారందరూ ఉంటారు, వనలీలలో గోపీ గోపాలక బాలకులుంటారు. కుంజలీలలో గోపికలు ఉంటారు. వీటినన్నింటినీ చూస్తూ ఉంటే రాధకు వ్యథగా

ఉంటుంది. తాను అందరకూ తెలిసేటట్టుగా ఆ లీలాసుఖం అనుభవించలేదు. తెలియకుండా రావాలి. ఎవరయినా చూస్తారు. ఏమయినా అంటారు. సమాజంలో అది యుక్తం కాదాయె! ఇవన్నీ చూస్తూ ఉంటే ఆమెకు ఒళ్లుమండిపోయింది. తన కృష్ణుడితో వాళ్ళు ఆవిధంగా ఉండడమును తాను సహించలేదు. పోనీ నికుంజలీలలో ఉండరాదూ! అక్కడ కృష్ణుణ్ణి దెప్పుతుంది. ఈర్ష్యపడుతుంది. అసూయిస్తుంది. కృష్ణుడు దూరాన ఉన్నా దగ్గర ఉన్నా రాధకు విరహమె. ఈ లోక లీలావిశేషమును బాగా భావించి భక్తులు చాలా గ్రంథాలు రచించారు.

ఒకనాడు యమునాతీరానికి వెళ్ళింది రాధ. బాల కృష్ణుడు వచ్చి ఆట్టే చూడడం మొదలుపెట్టాడు. వేణువూదాడు. రాధ కదలలేకపోయింది.

కృష్ణుడు :- నీవెవరు పిల్లా! మీ నాన్న పేరు ఏమిటి?

రాధ :- మానాన్న పేరు వృష...భాను.

కృష్ణ :- ఓ! హో! నీవు రాధవా?

రాధ :- నీవెవరబ్బాయీ? నా పేరు నీకు ఎట్లా తెలుసు?

కృష్ణ :- మావాడలో అందరూ నిన్ను గురించి చెప్పుకుంటారు. నీవు చాలా అందగత్తెవని విన్నానులే. ఇప్పుడు చూచాను.

రాధ :- నిన్నూ నేను విన్నానులె! నీవు దొంగవుటగా!

కృష్ణుడు :- నీదేమి దొంగిలించాను?

అన్నాడు కృష్ణుడు. రాధ నవ్వుకొన్నది. "రా! యమునా తీరానికి వెళ్ళుదాము". "కృష్ణుడు ఎంత ఆకర్షకంగా ఉన్నాడు!

ఎంత బాగా అన్నాడో! చాలా మధురంగా పలుకుతాడు" అని రాధ అనుకొంది. కాని సిగ్గుతో కదలలేక పోయింది.

"ఇవ్వాళ్ళకు నన్ను వెళ్ళనీ! మాఅమ్మ
ఏమయినా అంటుంది నన్ను పోనీ!"

అని అంటుంది రాధ. ఈవిధంగా రాధాకృష్ణుల మొదటి ప్రేమపరిచయమును కవులు కీర్తించారు. రాధను కృష్ణుడు ఆరాధిస్తాడు. రాధ కృష్ణుని కీర్తించుతుంది. నిత్యమూ వారి అనురాగం నవంనవముగా ఉంటుంది లోకభాషలో రాధా కృష్ణుల రీతిని అనురాగమంటారు కాని భక్తిభాషలో "ప్రేమ" అని అనాలి. ప్రేమ అనేది భగవంతునిపై అధికమయిన అనురాగము. భక్తిలో రాధాభావమనేది చాల ఉత్తమమయిన అవస్థ. రాధ పరాశక్తి. ఆమె జీవనమంతా పరమప్రేమ. దీనినే పరాభక్తి అంటారు. ఈవిధానం ప్రేమసూత్రంలో సంబంధింపచేసి ఉన్నతభావమును తెలియజేస్తుంది. సతీదేవి శివునకై దేహత్యాగం చేసినా, సీతాదేవి రామునకై సర్వ కష్టాలు సహించినా, పార్వతీదేవి పరమేశ్వరునికై మహా తపస్సుచేసినా పరమప్రేమనే సూచించేవిగా ఉన్నవి. రాధా దేవి కృష్ణునికై ఆత్మసమర్పణం చేసుకుంది. గోపికలు చూపిన ప్రేమకన్న రాధ ప్రదర్శించినప్రేమ సర్వోత్తమము. భక్తుని జీవితంలో చిట్టచివరి అవస్థ రాధాభావముతో ఉండాలి. రాధా బావమునే మహాభావము అని అంటున్నారు.

రాధా ప్రేమస్వభావంలో పరిపూర్ణమయిన విరహం కనడుపతుంది. క్షేత్రయ్య పదాలలో సెలవిచ్చినట్లుగా విరహంలోనే సాధకుల భావాలకు పరిపూర్ణత్వము వస్తుంది.

జీవుడు భగవద్విరహమును అనుభవిస్తున్నాడు. నిత్యము భగవానుని ప్రేమించి ఏదోవిధంగా భగవద్భావం పొందాలని మహాయత్నం చేస్తున్నాడు. ఆ యత్నాలలో తుది అనుభవాన్ని రాధాభావం సూచిస్తుంది. ఈనాటి లోకంలో రాధాభావము ననుభవించగలవారెక్కడున్నారో! కేవలం రాధాభక్తిని అనుకరించడమును భక్తిశాస్త్రాలు హర్షించవు.

భగవత్తత్వమును తెలిసికొనడానికి సంధినీశక్తి, సంవిచ్ఛక్తి, హ్లాదినీశక్తి, అనే మూడు మార్గాలున్నవట. హ్లాదినీశక్తి మహాప్రేమమయ మయిన రూపము. అందువలననే రాధను ప్రేమస్వరూపిణి అని భక్తులు కీర్తించుతున్నారు. జయదేవుడు గీతగోవిందంలో రాధాకృష్ణుల మహాభావమును కీర్తించాడు. అష్టపదులు పాడుకొనేవారందరూ ఈ దృష్టిలో గానంచేస్తే తత్వం తెలుస్తుంది.

రాధతో నందుడంటున్నాడు. "రాధా! మేఘాలు దట్టంగా కమ్మినయి. వనంలో దట్టంగా చీకటి చెట్లున్నవి. నా ఈ కృష్ణుడు రాత్రి భయపడతాడు. నీవీతనిని వెంటబెట్టుకొని ఇంటికి తీసుకుపో! అని అనగానే రాధాకృష్ణులు యిద్దరూ చెట్టాపట్టాలు పట్టుకుని బయలుదేరారు. ఆయమునాకూలంలో ప్రతిమార్గమూ, ప్రతిస్థలమూ రాధాకృష్ణ విహారమునే సూచిస్తున్నవి. అనే ఈభావంలో జయదేవుడు ఈ చెప్పిన సర్వార్థమును చూపిస్తున్నాడు.

"మేఘైర్మేదురమంబరం వనభువః శ్యామా స్తమాలద్రుమైః,
నక్తం భీరురయం త్వమేవ తదిమం, రాధే గృహంప్రాపయ
ఇత్థం నందనిదేశతశ్చలితయోః ప్రత్యధ్వకుంజద్రుమం
రాధామాధవయోర్జయంతి యమునాకూలే రహః కేలయః"

ఎప్పటికైనా మానవులందరూ రాధాభావమును పొంది తీర వలిసిందే. మానవ మనస్సులో రాధాప్రేమ స్వభావం వికాస మిచ్చి మనస్సును వెన్నవలె కోమలం చేస్తుంది. ఆ వెన్నవంటి మనస్సులోనే పరమేశ్వరప్రేమ తెలుస్తుంది. సామాన్యంగా ఈ చెప్పినది రాధా ప్రేమస్వభావము.



## ౭ కావ్యనాయికలు – కలభాషిణి

కలాపూర్ణోదయమనే తెలుగు కావ్యంలో కలభాషిణి కథ ఉన్నది. కథలోకథ కథలోకథగా కలాపూర్ణోదయము చాలాకథలు నిరూపించింది. అన్నికథలలోనూ ఏదోవిధాన కలభాషిణీ సంబంధం కనపడుతుంది. కలభాషిణీ సంబంధంకల కథలనన్నిటినీ సమన్వయించుకుంటే కలభాషిణి కావ్యనాయిక ఎట్లా అయిందో విశదమవుతుంది. కలభాషిణి మొదటి జన్మలో సరస్వతీ బ్రహ్మదేవుల పంజరంలోని చిలుక, తరువాతి జన్మలో మానవలోకాన ద్వారకానగరంలో వేశ్యాకులంలో ఒక నట ముఖ్యుని కూతురు, మూడవజన్మలో గొప్ప వంశగౌరవము కల రూపానుభూతి మదాశయులనే క్షత్రియ భార్యాభర్తల కూతురు మధురలాలస కలాపూర్ణునకు భార్య. ఈ మూడు జన్మల కథలను కలుపుకున్నట్లయితే కావ్యనాయిక అయిన కలభాషిణిని బాగా గుర్తించగలము.

కలాపూర్ణుని రాజసభలో బంగారుతొట్టెలో రెండు నెలల చిట్టిపాప ఉంది. ఒకనాడు రాజుగారికి మణిహారము బహుమానంగా వచ్చింది. దానిని రాజు ఆ పిల్ల మెడలో

ఉంచాడు. అపుడాశిశువు నవ్వి— "తిరుగా రెండేండ్లకు నీ సురుచిరహారోత్తమంబు జూడగ నాకుందొరకె. కనుంగవ చేసిన యురుపుణ్యము నేడు వెండియు ఫలియించెన్"-అన్నది. అందరూ ఆశ్చర్యపడ్డారు. "ఓఅద్భుతబాలికా! నీ పూర్వజన్మ విశేషాలు చెప్పు" అని రాజడిగాడు. ఆశిశువు కథ చెప్పింది.

"వినవయ్య! యోకీర్తిధన! యిట మునుపటి
పుట్టువు కాక తత్పూర్వమైన
పుట్టువునందు నంభుజగర్భదేవి పెం
చినయట్టి ప్రోఢి రాచిలుక నేను
నాడు తజ్జన్మంబునన్ శాపమెుక్కటి
తగుల రెండవమేను తాల్పవలసె"

చిలుకగా ఉన్నప్పుడు కథ యిది—

బ్రహ్మసరస్వతు లేకాంతంలో ఉన్నారు. వారి శృంగార కథలు చిలుకకు తెలిసినవి. మరునాడు రంభ దగ్గరకురాగా వాని నన్నిటినీ చిలుక చెప్పుతున్నప్పుడు సరస్వతివచ్చి

"తలకక యోసి! యేమిటి కతల్ తలపెట్టినదాన విచ్చటం?
దెలియము గాని నీవు పెనుద్రిమ్మరి కూతలదాన వేకదే!
బళిబళి యీ వికారములు ప్రాతె! యపిఘ్నత జాగి లంజవై
యిలపయి బుట్టుమంచు శపియించె మనంబున నల్కహెచ్చగన్"

ఇంతలో బ్రహ్మవచ్చి— "తదనంతర జన్మములో మదాశ యుండను జగతీపతికి మధురలాలస యను తనయవై కలాపూర్ణుడను రాజుకు భార్యవై పరమ పాతివ్రత్యమున సకలధర్మములు సాధించి కృతార్థవయ్యెదవు—" అని అనుగ్రహించాడు. ఇది పూర్వజన్మ కథ.

సరస్వతీశాపాన చిలుక కలభాషిణి అయింది. ఆకథ వినండి. కలభాషిణి చాలా అందమయిన కావ్యనాయిక.

"మొదల బలురేఖ గలదట యదియుగాక
వయసు క్రొత్తట వెలయాలి వంగడమట
వనిత చక్కదనంబును వన్నెలాడి
తనము గల్కితనంబును తరమెపొగడ".

అని కవి అంటాడు. ఒకనాడు కలభాషిణి తోటలో సఖులతో ఊయెల ఊగుతున్నది. ఆకాశంనుండి క్రిందికి దిగుతున్న మణికంధరుడనే గంధర్వుడు చూచి గురువయిన నారదునితో ఇలా అంటాడు

"తమిపూదీగెల తూగుటుయ్యెలల పంతాలాడుచుం దూగు నా
కొమరుం బ్రాయపు గబ్బిగుబ్బెతల యంఘ్రుల్చక్కగా జాగి మిం
టి మొగంబై చనుదెంచు శీపి గనుగొంటే దివ్య మౌనీంద్ర! నా
కమృగీనేత్రల మీద గయ్యమునకుం గాల్దాచు లాగొప్పెడున్."

ఒకనాడు మణికంధరుడు కృష్ణదర్శనానికి వచ్చి దండక రూపంగా ఆశుకవిత్వంతో స్తుతిచేశాడు. కలభాషిణి ఏకసంధతో గ్రహించి స్తుతిచేసింది. కవిత్వంలోని విశేషాలూ చెప్పింది. నారదుడు సంగీతం నేర్చికొనడానికి నిత్యము కృష్ణుని అంతఃపురానికి వచ్చేటప్పుడు శిష్యుని వెలుపలనే నిల్పి తన వీణ తానుపట్టుకోగా కలభాషిణి వినయమొప్పగా వీణపుచ్చుకొన్నది. అప్పుడు శ్రీకృష్ణుడే స్వయంగా మెచ్చుకున్నాడు.

"శిష్యురాలి నొకతెం దోడ్తెచ్చితిన్
దీనిగైకొని శిక్షింపుము."

అని జాంబవతికి చెప్పాడు. కలభాషిణి గానవిద్యాసంపన్నురాలయింది. నారదుడు కామరూపవరం ఇచ్చాడు. తాను వెళ్ళుతూ వెళ్ళుతూ

"కొమ్మ! మున్ను నీవాత్మలో గోరినట్టి
కాంతు రంభామనోహరాకారుడగుచు
మెఱయువానిని గూడి రమించగలవు
నమ్ము పొమ్మిక నీభవనమునకు."

అన్నాడు. కలభాషిణి మొదట మణికంధరుని ప్రేమించింది. ఆప్రేమ సఫలం కాదని మరల్చుకొంది. కొన్నినాళ్ళయిన తరువాత కలభాషిణి తన ఉద్యానవనంలో ఉండగా మణిస్తంభుడనే యోగివచ్చి ఆమెచేత పాడించి విన్నాడు. తనకు గల దూరశ్రవణ దూరదృష్టి శక్తులను అద్భుత విశేషాలను ప్రదర్శించాడు. మణికంధరుడు తపస్సుచేస్తుండగా రంభ నలకూబరుని విడిచి మణికంధరునిచేరి తపస్సు చెదరచేసిందని నలకూబరుడు ఒంటరిగా ఒక పూపొదరింటిలో ఉన్నాడని మణిస్తంభునిద్వారా తెలిసికొని, తనను ఎట్లయినా నలకూబరుడున్నచోటికి చేర్చమంది. నలకూబరునిపై యిదివరలో తనకు కలిగిన అనురాగమును నారదుడిచ్చిన వరంతో రంభ దూరాన ఉండగా సఫలం చేసికోవాలనుకున్నది.

లోకోత్తరగానం, లోకోత్తర సౌందర్యం కల వేశ్య అయిన ఈమెను మృగేంద్రవాహనా దేవికి బలియిస్తే రాజ్యలాభం కలుగుతుందని మణిస్తంభుడాలోచించి తన సింగం మీద కూర్చోబెట్టుకొని ఆకాశమార్గాన బయలుదేరాడు. దేవి ఆలయంలో ఉంచాడు. అక్కడ సుముఖాసత్తి అనే ముసలమ్మ వీనిదుష్టకార్యం చెప్పింది. కలభాషిణి భయపడింది. వాడు కొప్పుపట్టిలాగి ఖడ్గాన వేయబోగా

"ఓ యవ్వ ! నీకు బిడ్డనే కావవే ! నాకు నడ్డపడవె"

అని మొరపెట్టగా ముసలిది అడ్డంవచ్చింది. ముందుగా మణిస్తంభుడు దానినే నరికివేసినాడు. తరువాత కలభాషిణిని ఖండించబోగా దేవి యిద్దరిని విసరివేసింది. ఎక్కడో అడవిలో పూలపాన్పుపై పడ్డారు. అప్పటి కలభాషిణి రూపం ఇంకా

రమ్యంగా ఉందని మణిస్తంభుడు కామించి పట్టుకోనబోగా అది సహించక కలభాషిణి

"నన్నిదె! యీ పాతకి బల్మిపట్టెడు కృపన్ వీక్షింపరే కావరే"

అని గోలపెట్టగా "ఎవడురా! అతివను అల్లరిపెట్టేది?" అంటూ నలకూబరవేషాన మణికంధరుడు వచ్చాడు. వెంట బడ్డాడు. కలభాషిణి మాటుకువెళ్ళి యీతడు నలకూబరుడే అని సంతసంపడి కామరూపాన రంభాకారం ధరించి వాని దండచేరింది. యథేష్టంగా విహరించింది. ఇంతలో రంభ వచ్చింది. నేనే రంభను నేనే రంభనని యిద్దరూ పోట్లాడుకొని తిట్టుకున్నారు

"ఒట్టుసుమీ యన్న నొట్టుసుమీ యంచు
నేమేమి యనిన నేమేమి యనుచు
గానీగదే యన్న గానీగదే యంచు
నింకేల యనిన నింకేల యనుచు
నోసిపోవే యన్న నోసిపోవే యంచు
నౌనంటి వనిన నౌనంటి వనుచు
మఱవకు మిది యన్న మఱవకు మిది యంచు
నీవెంతయనిన నీవెంతయనుచు

నొకతె మగనికి నాసించు టొప్పదనిన
నొకతె మగనికి నాసించు టొప్పదనుచు
బట్టియాడె నారంభతో భ్రమరంభ
ప్రియుడు నిలుమన్న నిలువక పెద్దరొదగ."

"అఱపులుడిగి పోపో నీ
యఱచేతం బండ్లు వచ్చినప్పుడు మమ్మం
గఱచెదవు గాని, తగునెడ
మొఱయిడు మది యెట్టి దైవములు వినియెడినో."

కలభాషిణి ఈసడించి పలికింది. "రా! దేవసభకు రా!" అన్నది రంభ. ఈ సవతిపోరు అక్కడకూడానా! నేనురానంది బోగంచిలక. స్వర్గానికిరాలేక సాకు పలికింది. ఇది అసలురంభ కాదని వాడు విడిచివెళ్లాడు. 'కత్తివాతపడు' అని రంభ శపించింది. ఇక గతిలేక కలభాషిణి ఆలయం దగ్గరకు చేరింది. మణికంధరుడూ అక్కడకే వచ్చాడు. ఒకరిసంగతి ఒకరికి తెలిసి ఆశ్చర్యపడ్డారు. అన్నీ కలిసివచ్చిన వనుకుంటారు. మొదట మణికంధరుని ప్రేమించి కుదరక నలకూబరునిపై కామంపెట్టు కొని నలకూబరాకారునికలసి నలకూబరుడే అని సంతుష్టిపడి, ఇప్పుడు మణికంధరుడు కనబడగా ఏమన్నప్పటికీ అంతావ్యర్థమె అని కలభాషిణి గుర్తించింది. ఇక ఆ జీవితం చాలించాలను కుంది.

> " శ్రీయుతమైన దివ్యమణి చేతికి నబ్బగ బాఱవైచి త
> చ్ఛాయ యొకింత యున్కిగని చాల గ్రహించితి గాజుపూసకై
> నా యవివేక మేమనుకొనం? దుద దన్మణి యబ్బెనన్న న
> త్యాయత తత్సమాగమ సుఖాప్తికి నోచమి నెంచి కుందెదన్ "

అని సుముఖాసత్తి పవిత్రకథ గుర్తించి నమస్కరించి ఇట్లన్నది.

> " పూతంబయ్యె మదీయ కర్ణయుగ మో పుణ్యాంపు టిల్లాల! నీ
> పాతివ్రత్యము చందమున్విన మదిన్ భావింపగా నెట్టి దు
> ర్నీతిప్రక్రియ వారికైన గృపతో నీవిచ్చినం గల్గు త
> త్పాతివ్రత్యము నాకు మీద నయినం బ్రాపింప దీవింపవే! "

ఆత్మత్యాగానికి సిద్ధపడింది. దేవీసమీపంలో తన శిరస్సును ఖండించడానికి ధైర్యంగా అంగీకరించింది. ప్రాణభయము లేక దేవిని మెప్పించినందున వెంటనే జీవించి తన బంధువులతో ద్వారకలో ఉన్నది.

ఈ కలభాషిణిజన్మలో సరస్వతిశాపఫలం అనుభవించి ప్రేమచాపల్యంతో పశ్చాత్తాపపడింది. తుదకు ఉత్తమమయిన పాతివ్రత్యజీవనం అభిలషించింది. బ్రహ్మగారి అనుగ్రహాఫలముగా పరమపాతివ్రత్యమున కృతార్థురాలగుట మధురలాలస జీవనంలో గోచరిస్తుంది మూడవజన్మలో;

రూపానుభూతి మదాశయుడు అనే క్షత్రియ దంపతులకు మధురలాలసగా జన్మించింది. పితరులా కన్యను తమకన్న గొప్పవాడని కలాపూర్ణుడనే రాజుగారి ఆస్థానంలోకి వచ్చి వినమ్రులయినారు. మణిహారం మెడలో వేయగా వారి శిశువు జ్ఞానలాభముచే సకలవృత్తాంతములను గుర్తించి అందరకు ఆశ్చర్యకరంగా చెప్పింది. మధురలాలస క్రమంగా తల్లిదండ్రుల దగ్గర పెరిగింది. చిన్ననాటినుంచి కలాపూర్ణుని విశేషాలు చెప్పుతూఉంటే ఆదరంగా ఆలకించేది. పెదిగి యౌవనవతి అయింది. రాజుగారు కలాపూర్ణుడు చూచి వర్తమానం చేయించాడు. ఇద్దరకూ వైభవంగా వివాహమయింది.

"కడు గళాపూర్ణుడను కీర్తిగన్న యీత
డీసతి విశేషమె యగుట యెన్నవలదె;
యీ మధురవస్తువును గొన నెఱిగెగాన
మధురలాలస యను పేరు మగువకొనరు."

లోకమంతా వీరిదాంపత్యం హర్షించింది. పెండ్లికొడుకు వెంట ప్రియపుత్రినరణమిచ్చి పంపేటప్పుడు తల్లి రూపానుభూతి యీ విధంగా హితముపదేశించింది.

"సుముఖాసత్తి మణిస్తం
భ మహాయోగీంద్రు లత్తమాములు నీకో
రమణీ మణి! నీ కోడం
డ్రము నెఱుగరు వారు యోగరసనిశ్చలతన్

"ఉత్తమామలన్న నాచార్యుడన్న స
ద్ధర్మమన్న నిష్టదైవమన్న
నీకు బతియ సుమ్ము నెయ్యంపుగూతుర !
యిది మహోపదేశ మెఱిగికొనుము"

ఇది కావ్యనాయికలలో ఉండవలసిన ఉత్తమలక్షణం. అది యీ జన్మలో పూర్తయింది. అందువలన కలభాషిణీ నాయికాత్వము నానాజన్మలలో పరిపక్వమై ఈజన్మలో కృతార్థమయినట్లు కలాపూర్ణోదయం నిరూపించుతున్నది. కావ్య పరమార్థముగా వేరొక విషయమును కూడా పెద్దలు భావించుతున్నారు. ప్రియుని సమీపంలో పరవశురాలయిన సరస్వతీదేవి కంఠంలోనుండి ఒకానొక అపూర్వమయిన ఆనంద ధ్వని వెలువడింది. అది చిలుకకుమాత్రమే తెలుసు. దాని వ్యాప్తి కావ్యకల. అది ఒకజన్మలో సిద్ధంకాదు. నానాజన్మలు కలగాలి. అందుకే కలభాషిణి మధురలాలసలు కావలసి వచ్చారు. అటు పూర్వజన్మకు ఇటు పరజన్మకు సంబంధం కలపడానికై కలభాషిణి కావ్యనాయిక అయింది. మధురలాలస జీవనంలో ఆమె పరిపూర్ణత విశదమయింది. అదే కలాపూర్ణ దాంపత్యము. ఇంత రమ్యంగా దీన్ని నిరూపించడానికే కవి పింగళి సూరన కలభాషిణిని ఆవిధంగా దిద్దితీర్చాడు. కలభాషిణీ జీవనంలో కూర్చవలసినవి లేవు. తీసివేయవలసినవి లేవు.

౧. దివ్యలోకంలోని చిలకకు కలాపూర్ణమయిన సరస్వతీ వదనానుగ్రహమే నిత్యమూ కావాలి.

౨. మానవలోకంలోని కలభాషిణికి కళల పూర్ణత్వముకల వ్యక్తి సాహచర్యం కావాలి.

3. నిత్యము మధురమునందు కాంక్షగల మధురలాలసకు కలాపూర్ణుని కటాక్షమే కావాలి.

ఈ మూడున్నూ ఒక పరమావధి అందుకొనదలచిన వారి జీవితంలో ఉండే అవస్థలు- తుదకు కృతార్థత. అది కలభాషిణి కావ్యనాయికలలో గోచరిస్తుంది. లోకంలో రెండో కలభాషిణి లేదు. వచ్చునేమో తెలియదు.



## ౮. మన పాత కథలు : భోజ కాళిదాస కథలు

మన దేశంలో పాతకథలు చాలా ఉన్నాయి. మన ఇళ్ళ దగ్గర పెద్దవాళ్ళు అంటే తాతయ్యలు, నాయనమ్మలు మామ్మలు, అమ్మమ్మలు, బామ్మలు చాలా కథలు చెప్తూ ఉంటారు. అవి వినసొంపుగా ఉంటయి. వినేటప్పుడు "అవి సత్యములేనా" అని సందేహించము. మనకు ఆసక్తి పుట్టించడం, వినేటట్లు చెయ్యడం, నీతి ధర్మాలను బోధించడం వానిపని. చిన్నపిల్లలు అవి విని తమకు వచ్చిన మాటలతో మళ్ళీ ఆ కథలు చెప్తారు. కథలు చెప్పేటప్పుడు పెద్దవాళ్లు బాగా తెలియాలని మనకు అందుబాటులో ఉన్న విషయాలు కలుపుతూ చెప్తూ ఉంటారు, పాతకథలలో మన అచారాలు కన్పడుతూ ఉంటయి. "మన నాయనమ్మ కథలు జీవితాలకెంతగానో ఉపకరించుత"వని పెద్దలన్నారుట. అందువలన ప్రతివారు నాయనమ్మలు కావటం బాగానే ఉంటుంది.

మన పాతకథలకు ఒక రూపంరాలేదు. వేదంమాదిరి విని తెలుసుకోవాలి. చెప్పేవారు తగ్గిపోయినారు. మన నాగరి

కత పాతకథలనుగూడ మెచ్చుకొనేదయితే బాగుండును. ఇటువంటి కథలను పోగుచేసి యిప్పటివారికి వచ్చేవారికి దాచటం చాలామంచిది. భోజకాళిదాస కథలు ఈవిధంగా సేకరించిన కథలే. అందుకనే నేటిదాకా ఉన్నాయి. కాళిదాసుకూ భోజుడికీ ఏమీ సంబంధములేదు. ఇద్దరిమధ్యా ౮౦౦ సంవత్సరాలు తేడా ఉన్నది. భోజుని దగ్గరకు వచ్చిన కవులకు భోజరాజుకు సంబంధములేదు. అయినా భోజకాళిదాస కథలు చమత్కారంగా ఉండి లోకంలో వ్యాపించినవి.

ధారానగరంలో సింధులుడు అనే రాజున్నాడు. ఆయనకు ముసలితనంలో కొడుకు పుట్టాడు. వాడిపేరు భోజుడు. సింధులరాజు భోజుని తన తమ్ముడయిన ముంజునిచేతిలో పెట్టి గతించాడు. భోజుడు చక్కగా చదువుకొంటున్నాడు. ౫౫ సంవత్సరాలకు పైగా భోజుడు రాజ్యపాలనం చేస్తాడని జ్యోతిష్కులు చెప్పారు. ముంజుడికి అసూయ పుట్టింది. భోజుని చంపించాలని యత్నం చేశాడు. భోజుని చంపటానికి అరణ్యంలోకి తీసుకొనిపోయి "నీ చివరిమాట ఏమిటి?" అని చంపేవాడు అడిగితే భోజుడు ఒకశ్లోకం వ్రాసి యిచ్చాడట. అప్పుడు భోజుని ముఖం చూడగానే చంపదలచినవాని అభిప్రాయమంతా మారిపోయింది. భోజుణ్ణి చంపలేదు. దాచిపెట్టాడు ముంజుడి దగ్గరకు వచ్చి భోజుని ఖండించాను" అన్నాడు. "భోజుడేమీ అనలేదా?" అని ముంజుడు అడిగితే భోజుడిచ్చిన కాగితమిచ్చాడు. దానిలో ఈ విధంగా ఉన్నది.

"మాంధాతాచ మహీపతిః కృతయుగాలంకార భూతోగతః
సేతుర్యేన మహోదధౌ విరచితః క్వాసౌ దశాస్యాంతకః
అన్యేచాపి యుధిష్ఠిరప్రభృతయో యాతాదివం భూపతే
నైకేనాపి సమంగతా వసుమతీ ముంజ! త్వయాయాస్యతి"

"కృతయుగాలంకారుడు మాంధాత గతించాడు. సేతువుగట్టి రావణుణ్ణి చంపిన రాముడూ లేడు. ధర్మరాజాదులు కూడా దివంగతులయినారు. వారెవరూ ఈ భూమిని వెంటబెట్టుకు పోలేదు. ఓ ముంజభూపతీ! ఈ భూమి నీతో వస్తుందికాబోలు." ఇది చూడగానే ముంజుని మనస్సు మారిపోయినది. దుఃఖించాడు. పశ్చాత్తాపము కలిగింది. మహామంత్రి యుక్తిగా భోజుని తీసికొనివచ్చి ముంజునకు అర్పించాడు. ముంజుడు భోజునికి పట్టాభిషేకంచేసి అరణ్యాలకు వెళ్ళాడు. అప్పటినుండి భోజుడు భోజరాజు అయినాడు.

భోజరాజు చక్కగా పాలిస్తున్నాడు. పండితులను కవులను ఆదరించాడు. బాగా ధనమిచ్చాడు. అప్పుడు ధారానగరంలో అందరూ విద్వాంసులే. బ్రాహ్మణుడైనా మూర్ఖుడైతే నా పట్టణంలో స్థానంలేదు. కుంభకారుడయినా విద్వాంసుడయితే నా పట్టణంలో ఉండాలి.

"విప్రోపి యో భవేన్మూర్ఖః సపురాద్బహిరస్తు మే
కుంభకారోపి యో విద్వాన్ సతిష్ఠతు పురేమమ"

అని చాటింపచేశాడు. ౫౦౦ మంది పండితకవులు భోజరాజుగారి ఆస్థానంలో ఉండేవారట. వాళ్ళంతా ఆరాజ్యాన్ని తెలివితేటలుండేట్లు చేసి ఉంటారు. దేశం ఆవిధంగా ఉంటే ఎంతో బాగుంటుంది.

ఒకనాడు శంకరకవి వచ్చి కవిత్వం చెపితే భోజరాజు ౧౨ లక్షలిచ్చాడుట. చూచినవారికందరికి అసూయపుట్టింది. "ఈ శంకరయ్య గొప్పేమిటి. ఏదో సామాన్యకవి. మనకు ఒక్కొక్క లక్షకదా! ఈయనకు ౧౨ ఎందుకియ్యాలి?" అని

మథన పడుతున్నారు. వారికి భోజుడిభావం తెలియలేదు. భోజరాజు అంతఃపురానికి వెళ్ళాడు. ఇంతలో ఆస్థానంలోకి ఒక శృంగార వేషధారి వచ్చి యీ విషయము తెలుసుకొని "శంకరకవికి యిచ్చినది ఒకలక్షే! ఆ కవిలో ఉన్న ౧౧ శంకరులకు ఏకాదశరుద్రులకు ఒక్కొక్కలక్ష. మొత్తం ౧౨ లక్షలు" అని అన్నాడు. ఈ విషయం రాజుకు తెలిసింది. వెంటనేవచ్చి యీ కొత్తవానిని ఆదరించి "నీపేరేమిటి?" అని అన్నాడు. రాజుచేతిలో ఆతడు "కాళిదాసః" అని వ్రాశాడు. తనపేరును తాను నోటితో చెప్పరాదు. భోజుడు కాళిదాసుకు నమస్కరించాడు. అప్పటినుంచీ వారిద్దరికీ మంచి స్నేహం కుదిరింది.

ఒకసారి వేదపండితులకు రాజసన్మానము పొందాలని అభిలాష కల్గింది. కవిత్వం చెప్తేనే కాని రాజు సన్మానించడు. వారికి కవిత్వంరాదు. ఆలోచించి ఆలోచించి చిన్నపద్యంలో ఒక్కపాదం చెప్పారు. మరొక అవధానులు మరొకపాదం చెప్పారు. పద్యం సగమయింది. ఇంకా సగమున్నది. ఇక వారికేమీ సాగలేదు. ఆకస్మికంగా కాళిదాసక్కడకు వచ్చి వారి అవస్థ తెలుసుకొని వెంటనే మిగతాసగం చెప్పాడు. వేదపండితులకు మహాసంతోషం కలిగింది. రాజభవనానికి వెళ్ళి మేము కవిత్వం చేసుకొని వచ్చాము అన్నారు. అందరూ వెంటనే వేదము పల్కినట్లు స్వరసహితంగా

"భోజనందేహి రాజేంద్ర! ఘృత సూప సమన్వితమ్
మాహిషంచ శరచ్చంద్ర చంద్రికా ధవళందధి."

అని పలికారు. రాజువిని ఉత్తరార్థం కాళిదాసు వ్రాశాడని

తెలుసుకున్నారు. "పద్యంలో పూర్వార్ధానికి ఏమీ యివ్వను ఉత్తరార్ధానికే యిస్తాను" అని అక్షరలక్షలిచ్చాడట. "కాళిదాసా! నీవేగా యిది వ్రాసింది." అని అన్నాడు. భోజకాళిదాసుల ఒకరినొకరు అంత బాగా తెలుసుకున్నారు.

ఎందుకో భోజకాళిదాసులకు అభిప్రాయభేదం వచ్చింది. కాళిదాసు ఆస్థానంలోకి రావడం మానేశాడు. భోజరాజు సభ చిన్నపోయింది. విద్యావినోదం సరిగా లేదు. తలిమ్మాళ్ల పండితులు చెప్పలేక పోతున్నారు. మళ్ళీ వెతికి వెతికి కాళిదాసును పిలిపించుకుంటేనేగాని భోజరాజుకు సంతోషం కలుగలేదు.

ఒకప్పుడు సకుటుంబముగా ఒకకవి రాజస్థానానికి వచ్చాడు. తానొక సమస్య ఇచ్చాడు.

"క్రియాసిద్ధిః సత్త్వేభవతి మహతాం నోపకరణే"

"పనులు కావాలంటే మహాత్ములకు సాధన మక్కరలేదు. ధైర్యంచాలు" ఇది దీనిభావము. అప్పుడు వారందరూ సమస్యను పూరించారుట. కవికోడలు ఈవిధంగా పద్యం చెప్పింది-

"ధనుః పౌష్పం మౌర్వీ మధుకరమయీ చంచలదృశాం
దృశాంకోణో బాణః సుహృదపి జడాత్మా హిమకరః
స్వయం చైకోనంగః సకలభువనం వ్యాకులయతి
క్రియాసిద్ధి స్సత్త్వే భవతి మహతాం నోపకరణే"

"మన్మధునికి శరీరంలేదు, పుష్పమే ధనుస్సు. తుమ్మెదలే నారి. దృక్కోణమే బాణము. చల్లని చంద్రుడు స్నేహితుడు. అయినా మూడు లోకాలు వ్యాకులపెడుతున్నాడు. మహాత్ములకు సాధనమక్కరలేదు" అని దీని భావము. రాజు చాలా

హర్షించి తనభార్య లీలాదేవి ఆభరణాలన్నిటిని బహుమానంగా యిప్పించాడు.

ఒకసారి రాజు వేటకెళ్ళాడు. అక్కడ ఒకపిల్ల కనపడింది.

"అమ్మాయీ! నీవెవరు?"

"రాజా! నేను కిరాతస్త్రీని."

"నీ చేతిలో అదేమిటి?"

"పలం"

"ఎండిపోయినదేమి?"

"ఆదరంగా వినురాజా! నీకీర్తిని సిద్ధాంగనలు గానం చేస్తుంటే లేళ్ళు సంగీతానికి లోభపడి మేత మేయలేదు" అని చెప్పింది. రాజు బహుమానించాడు. వారి సంభాషణ ఒక పద్యమయింది.

"కాత్వంపుత్రి?" "నరేంద్ర లుబ్దకవధూః" "హస్తేకిమేతత్" "పలం"
"క్షామం కిం" "సహజం బ్రవీమి నృపతే యద్యాదరాచ్ఛ్రూయతే
గాయంతి త్వదః పియాశ్రుతటినీ తీరేషు సిద్ధాంగనాః
గీతాంధాః నతృణం చరంతి హరిణాః తేనామిషందుర్బలం"

రాజువిని అక్షరలక్షలు దానంచేశాడు. ఆ అక్షరలక్షలకు యీనాడు మనం అర్థం ఏమిగా చెప్పుకోవాలో. లక్షఅంటే నాటికాలపు ఒక నాణెమేమో!

ఒకనాడు రాజు వేటకెళ్ళాడు. కట్టెలమోపు నెత్తిన బెట్టుకొని ఒక బ్రాహ్మణుడు నదిని దాటుతున్నాడు. "నీరెంత లోతుంది?" "మోకాటిలోతు" "మీకీఅవస్థ ఎందుకు?" "అందరూ నీవంటివారా?" ఈ సంభాషణ వారికి పద్యంలోనే సాగిందట.

"కియన్మానం జలం విప్ర" "జానుదఘ్నం నరాధిప"
"ఈదృశీ కిమవస్థా తే" "నహి సర్వే భవాదృశాః".

భోజుని కాలంలో అందరూ కవిత్వం చెప్పేవారుట. ఏమాట యినా కవిత్వంగా వచ్చేది కాబోలు. నేడుకూడా కొందరు ఉత్తరాలు పద్యాల్లో వ్రాస్తున్నారు. ఒకసారి భోజుడు నిద్రిస్తూ ఉండగా ఒక దొంగ వచ్చాడు. చాలా రత్నాలు హరించి వెళ్ళబోతున్నాడు. రాజుకు మె కువ వచ్చింది. రాజుగారికి చక్కని అంతఃపురం ఉన్నది. సంతోషంతో కవిత్వం చెప్పుకొన్నాడు. మూడుపాదాలు కవిత్వం సాగింది. నాల్గో పాదం రాలేదు. వెంటనే అక్కడిదొంగ ఆపద్యాన్ని నాల్గో పాదంతో పూరించాడు. రాజు సంతోషించి దొంగకు తన చేతికంకణం బహుమానంగా యిచ్చాడు. ఇట్లాంటికథలు భోజునివిషయంలో చాలా ఉన్నయి. కవులందరూ వచ్చి భోజరాజును అనేకరకాలుగా స్తోత్రాలు చేసేవారు. రాజులకు స్తోత్రాలంటే అంత యిష్టమా! అంతగా కవులను పండితులను ఆదరించి భోజరాజు అంతగా గొప్పవాడై ఉండాలి.

భోజరాజు సింహాసనము నలంకరించి ఉండగా ఆస్థానంలోకి భవభూతి అనే కవివచ్చి చాలగర్వంగా పలికాడు. అందరినీ సంతోషపెట్టగల విద్య మాకున్నది. సంపదలులేవు" అని భవభూతి అంటే అందరికీ కోపాలు వచ్చినవి. "నాలుగయిదు పద్యాలు చెప్పేవారు కూడా నాసాటి కవులు అవుతారా! నాలుగయిదు కుండలు చేసేవాడుకూడా మూడు లోకాలు సృష్టించే బ్రహ్మయినట్లే" కాళిదాసు వాక్కుకూడా నా కవిత్వందగ్గర బెదురుతూ బెదురుతూ ఉంటుంది", కాళి

దాసుకీ భవభూతికీ మహాసభలో పోటీ వచ్చింది. అప్పుడు భోజరాజు కాళిదాసును చూచి "నీకు భవభూతితో సామ్య మేమిటి" అన్నాడు. "ఏమండీ భవభూతి కవిఅయితే కాళిదాసు కవికాడా ?" అని సభ అడిగింది. "కాళిదాసు కేవలం కవి కాడు. భూమి కవతరించిన పార్వతి అవతారమే ఆయన" అని రాజన్నాడు. భవభూతికి కోపం వచ్చింది. భువనేశ్వరీ దేవాలయములోనికి వెళ్ళి త్రాసులో ఇద్దరి కవిత్వాలు తూచారు. అప్పుడు భవభూతికవిత్వము తేలికై తక్కెడ పైకి లేస్తూంటే భువనేశ్వరీదేవి తన దగ్గర పద్మంలోని మకరందాన్ని వేలితో భవభూతి పత్రాలపై చిలికింది. అది కాళిదాసు గుర్తించి,

"అహో మే సౌభాగ్యం మమచ భవభూతేశ్చ భణితం
ఘటాయామారోప్య ప్రతిఫలతి తస్యాం లఘిమని
గిరాందేవీ సద్యః శ్రుతికలిత కహ్లారకలికా
మధూల్ మాధుర్యం క్షిపతి పరిపూర్త్యై భగవతీ."

అపుడు వెంటనే భవభూతి కాళిదాసుకు నమస్కరించి భోజరాజు గొప్పతనాన్ని మెచ్చుకున్నాడు.

ఒకనాడు భోజరాజు కాళిదాసుని "మహాకవీ! నీవు నాచివరి శ్లోకం చెప్పాలి" అని అడిగాడు. కాళిదాసుకు కోపం వచ్చింది. పట్టణం విడిచిపెట్టి ఎక్కడికో వెళ్ళాడు. కాళిదాసు వియోగం భోజరాజుకు కష్టమయింది. యోగివేషం ధరించి దేశాలు తిరుగుతున్నాడు. కాళిదాసు యోగినిచూచి యోగిది ధారానగరమని తెలుసుకొని 'భోజుడుకుశలమేనా' అని అన్నాడు. 'భోజుడు చనిపోయినాడని' యోగి అన్నాడు. కాళిదాసు వెంటనే క్రింద పడిపోయినాడు. "దేవా! నీవులేక

నేను భూమిపై ఎందుకు ఇదిగో నేనూవస్తున్నా" అని. భోజ రాజు ఇదివరలో చెప్పమనిన చివరి పద్యాన్ని ఈవిధంగా చెప్పాడు.

"అద్యధారా నిరాధారా నిరాలంబా సరస్వతీ
పండితాః ఖండితాస్సర్వే భోజరాజే దివంగతే".

ఇప్పుడు ధారానగరానికి ఆధారములేదు. సరస్వతికి ఆలం బనములేదు. పండితులు ఖండితులైనారు. భోజరాజు పోతే ఏముంది" అని దీనిభావము. ఆపద్యము వినగానే యోగి నిశ్చేతనుడై క్రిందపడినాడు. కాళిదాసు అది చూచి "ఈతడే భోజరాజు. ఎట్లయితేనేమి నాచేత చివరిపద్యం చెప్పించు కొన్నాడు" అని అనుకొని వెంటనే ఆచరమశ్లోకాన్ని మళ్ళీ ఈవిధంగా చెప్పాడు.

"అద్యధారా సదాధారా సదాలంబా సరస్వతీ
పండితా మండితాస్సర్వే భోజరాజే భువంగతే".

భోజరాజు భూమికిరాగా ధారానగరానికి ఆధారం వచ్చింది. సరస్వతికి అవలంబనము కలిగింది. పండితులకు అలంకారము వచ్చింది. ఇదివినగానే భోజరాజు జీవించాడు.

భోజ కాళిదాస కథలు వేయి సంవత్సరాలనుంచి దేశంలో బాగా వ్యాపించినయి. లోకం చాలా ఆదరంగా తెలుసుకుంటున్నారు. ఈ కథలేకాక కాళిదాసుని గురించి భోజుని గురించి తెలుసుకోవలసిన విశేషాలు యింకా చాలా ఉన్నవి.



# ౯ శృంగార రసము

"అచ్ఛిన్న మేఖల మలబ్ధ దృఢోపగూఢమ్
అప్రాప్త చుంబన మవీక్షిత వక్త్రకాంతి
కాంతా విమిశ్రవపుషః కృత విప్రలంభ
సంభోగ సఖ్యమివ పాతు వపుః పురారేః"

అర్ధనారీశ్వరు డయిన పరమశివుడు పరమేశ్వరికి తన సగము శరీరము సమర్పించాడు. వారిద్దరకూ దేహము ఒక్కటే. అందువలన వేరువేరు దేహాలతో ఉండే భార్యాభర్తలకువలె వారికి ఒకరినొకరు చూచుకొనడము మొదలయినవి లేవు. ప్రేయసీ ప్రియులయినవారికి ఇటువంటివేవీ లేనందున వియోగమున్నది. ఏకదేహమే అయినందున వియోగము తెలియని సంయోగమూ ఉన్నది. భారతీయుల శృంగార తత్వములో ఇది గొప్ప ఆదర్శము. ఇంతకన్న శృంగారానికి పరమావధి ఏమీ లేదు. అందుకనే భోజరాజు

"శృంగార వీర కరుణాద్భుత రౌద్రహాస్య
బీభత్సవత్సల భయానక శాంతనామ్నః
ఆమ్నాసిషుః దశ రసాన్ సుధియో వయం తు
శృంగారమేవ రసనాద్రసమామనామః"

"శృంగారము మొదలయిన కావ్యసరములు పది ఉన్నవని కొందరంటారు. కాని, శృంగారము ఒక్కటే రసము అని మేము అంటున్నాము" అని అన్నాడు. ఆస్వాదింపబడేది రసమవుతుంది. ఆ ఆస్వాదనము ఒక్క శృంగారములోనే ఉంది. తన భావనా సామర్థ్యము ననుసరించి కావ్యరసమును భావింపగలవారిని "రసికు" లంటారు. శృంగార భావవ మున్నవారికే ఈ బిరుదం వస్తుంది.

ఆత్మస్థితం గుణవిశేషమహంకృతస్య
శృంగారమాహురిహ జీవితమాత్మయోనేః

"ప్రతి ప్రాణికి ఆత్మలో ఒక "అహంత" ఉంటుంది. అదే సర్వ కాంక్షలకు మూలము. "నేను" అను భావము "నాది" అనే భావనమే అహంత. అది శృంగారానికి రూపము కలుగ జేస్తుంది. అని శృంగారము నిరూపిస్తూ భోజదేవుడన్నాడు. ఈదృష్టితో శృంగారమును చూస్తే అది ఎంతో పవిత్రమనీ మానవత్వమును సఫలము చేసేదని తెలుస్తుంది.

"శృంగారో విష్ణుదైవత్యః" అని నాట్యశాస్త్రంలో ఉంది. శృంగార రసానికి విష్ణువు దేవత కాబట్టి, విష్ణువు సర్వ దేవప్రధానుడు కాబట్టిన్నీ శృంగారము మొదటి రసమని ఒక రన్నారు. "విష్ణుః కామదేవః" అని అర్థం చెప్పుకోవాలి. ఈవిధంగా అభినవగుప్తపాదులు చెప్పుతున్నారు. నిత్యనూతన మయిన సౌందర్యం కలిగి సుఖప్రీతులను కలుగజేస్తూ నెమ్మది నెమ్మదిగా మనస్సును మార్చి లగ్నముచేయగల స్వభావము శృంగారంలో ఉంటుంది. సర్వప్రాణులు శృంగారమును అభి మానిస్తారు. "వాతాంబు పర్ణహారులై నిర్జనవన సంచారులై మితాహారులైన" ముని మహర్షులు కూడ శృంగారానికి నమస్కరించుతారు.

"గరిమ నదులెన్ని కలిసిన కప్పుకొనుచు
జలధిగను పట్టురీతిని జగతి భావ
సంచయము లెన్ని గలసిన మించనీక
తాన గనుపట్టు భావంబు స్థాయి తలప."

సముద్రములో ఎన్ని నదులు కలిసినా సముద్రజలం మారదు. అట్లే స్థాయిభావంలో ఎన్ని కలిసినా దాని స్వభావం మారదు.

అందువలననే అది స్థాయి. స్థాయిభావము రసముగా మారుతుంది. పాలు పెరుగుగా మారినట్లు. వయసులోనున్న స్త్రీ పురుషులకు పరస్పరము యోగ్యమైన ఆసక్తి కలిగితే దానిని "రతి" అంటారు. ఈరతి అనుచితమయినది కారాదు. దాంపత్యముకలవారి రతి రసమవుతుంది. (నాయికా నాయక) ప్రేయసీ ప్రియుల అనురాగములో ఒకరి అనురాగంలో మరొకరు ఆలంబనంగా ఉండాలి. ఒకరొకరి హావభావాదులచే అనురాగము సూచితమవుతుంది. "అలసాలోలములై అచంచలములై ఆకేకరాగ్రంబులై అలఘువ్రీడములై, అనింద్యగములై, ఆనంద పూర్ణంబులై సులభాసూయములై, సుతీక్ష్ణరుచులై, సువ్యక్తరాగంబులై" ప్రేయసి ప్రియుణ్ణి చూచినట్లుగా కవులు వర్ణించుతారు. వారి మనస్సులలోని ఉత్సాహాదులు వారి అనురాగమును వృద్ధి పొందించి రససిద్ధిని కూర్చుతూ ఉంటవి.

శృంగారానికి "రతి" అనేది స్థాయిభావము. ఈస్థాయిభావమె బాగా పరిపోషం పొందితే రసమవుతుంది.

ఆ భావనోదయ మనన్యధియా జనేన
యో భావ్యతే మనసి భావనయాసభావః
యో భావనా పథమతీత్య వివర్తమానః
సాహంకృతో హృది పరం స్వదతే రసోసౌ.

మనసులో భావన కలిగినది మొదలు ఏకాగ్రముగా ఇతరములయిన ఊహలు లేకుండా భావింప బడేదయితే భావము అంటారు. అదే మన భావనకూడా దాటి హృదయంలో ఆత్మానుభవమును ఆనందమును కలుగజేసేదయితే రసమవుతుంది.

తన మనస్సుకు అనుకూలమయిన విషయంలో మనసు బాగా ఆసక్తమై ఉండడమును "రతి" అంటారు. దీనినే ప్రేమ అని ప్రీతి అని అనురాగమని పర్యాయపదాలతో పలుకుతారు.

"రతి దానాయక నాయికాది పరతన్ రంజిల్లు శృంగారమై
క్షితిలో దేవద్విజాది పరతన్ చెన్నొందు సద్భక్తియై
సుత మిత్రాశ్రిత సోదరాది పరతన్ సొంపారు వాత్సల్యమై
మితి చెప్పంగలదే రసస్థితికి చేష్మం జూడగా నెయ్యెడన్."

భర్తపై ఉన్న ప్రేమ మాత్రమే శృంగారమవుతుంది. ఇతర ప్రేమలకు శృంగారమనే పేరురాదు. పరస్త్రీప్రేమలు వేశ్యాప్రేమలు శృంగారముకాజాలవు.

పరమాత్మ తానొక్కడూ ఉండలేక భయపడి స్త్రీని సృష్టించాడట. వారిద్దరూ "పతిశ్చ పత్నీచా భవతాం" అని ఉపనిషత్తు చెప్పుతున్నది. ఒకే ఆత్మ స్త్రీపుంసరూపంగా సృష్టిలో గోచరించింది. సృష్టి హేతువయిన ఆత్మతత్వము మహాశృంగారము. అది ప్రపంచంలో అంతటా ఉన్నది. దేవ, మానవ, పశు, పక్ష్యాదులలోనే కాక చెట్టు, పుట్ట, రాయి, రప్ప, ధూళి, దుమ్ము అంతటా మనకు తెలియకుండా స్త్రీపుంస స్వభావం ఉన్నదని తత్వవేత్తలు అంటున్నారు. అదే శృంగారము. ఇది చాల గంభీరమయిన విషయము. తెలుసుకోవడం కూడ కష్టమే.

"విభావానుభావ వ్యభిచారి సంయోగా ద్రసనిష్పత్తిః

"స్థాయిభావములు సజాతీయ విజాతీయంబుల జెడక గృథ విభావ సదమలానుభావ సాత్త్విక భావ సంచారిభావముల రసములై వర్తించు" అని రసాభరణమనే గ్రంథంలో ఉంది.

"మొదల సజాతీయంబను నది విభునకు నాయి కాంతగాలోకనమై
పొదలు విజాతీయంబను నది క్రోధాఖ్యంబు రెండు నహితము రతికిన్."

ఈ ఉదాహరణము వినండి.

ఎన్నడుచూచె నన్నునతడింపదలిర్పగ నాటనుండియన్
మన్నన వెల్తిగాదు పరమానవతీసతి పొంతబోడు, ప్ర
చ్ఛన్నవిరోధి మజ్జననిచాయలు వారగ నేమిపల్కినన్
మిన్నకపోవుగాని తరుణీ! మది క్రోధములేదు శౌరికిన్.

రతిస్థాయిభావమన్నది పై పద్యంలో చెప్పిన విధంగానే ఉండాలి.

అందుకనే రామాయణంలో సీతారాముల దాంపత్యమును మనమంతా శృంగారాదర్శంగా గౌరవించుతున్నాము. సీతారాముల ప్రేమను భవభూతి ఎంతబాగా చెప్పాడో వినండి.

అద్వైతం సుఖదుఃఖయోరనుగతం సర్వాస్వవస్థాస్వపి
విశ్రామో హృదయస్య యత్ర జరసా యస్మిన్నహార్యో రసః
కాలేనావరణాత్యయాత్పరిణతే యత్స్నేహసారే స్థితం
భద్రం తస్య సుమానుషస్య కథమప్యేకం హి తత్ప్రార్థ్యతే.

సుఖంలోకాని దుఃఖంలోకాని ఒకేవిధంగా జాగ్రత్తులో స్వప్నంలో సుషుప్తిలో అనుగతంగా కూడుకొని ఉండేది, ఒకరొకరి హృదయాలకు విశ్రాంతి నిచ్చేది, ముసలివాళ్ళయినా అభిమానం పోకుండా ఉండేది, వివాహము మొదలు తుది వరకూ బాగా వికాసంపొంది ఉండే ప్రేమ ఒక్కటే. మంచి దంపతులకు ప్రార్థింపదగినది. ఇంతకన్న దంపతుల జీవితంలో ఆదర్శంలేదు. ఇటువంటి శృంగారవిధానమె సమాజశ్రేయస్సు సంపాదించి సత్సంతానము కలుగజేస్తుంది.

శృంగారజీవితంలో సత్సంతానప్రాప్తినే ఫలముగా జెప్పారు కాళిదాసాదికవులున్నూ ఆవిధంగానే వ్రాశారు. పార్వతీదేవి శివుని తనభర్తగా స్వీకరించాలని వసంత పుష్పాభరణం వహించి వచ్చింది. శివుడు మన్మథుని దహించి కోపంతో లేచిపోయినాడు. పార్వతి తనసౌందర్యం శివుని వశీకరించుకోలేక పోయిందని తనరూపాన్ని నిందించుకొన్నది. "నినిందరూపం హృదయేన పార్వతీ, ప్రియేషు సౌభాగ్యఫలాహి చారుతా" అని కాళిదాసు అన్నాడు. ఉత్తమమయిన శృంగారానికి దేహసౌందర్యం తగదని తపోరూపమయిన సౌందర్యం కావాలని కాళిదాసు భావించాడు. పార్వతి తపస్సు చేసింది. శివుడు చిన్న వటువురూపంలో వచ్చి ఎగతాళిగా మాట్లాడుతూ ఉంటే పార్వతికి చురుక్కున కోపం వచ్చింది. తానువలచిన ప్రియుణ్ణి ఇతరులు ఏమోఅంటే తాను సహించలేదు. కుమారసంభవకావ్యంలో పార్వతీపరమేశ్వరుల మహాశృంగారమును వర్ణించి కాళిదాసు శృంగారము ఎంతగొప్పగా ఉండవలసిందీ నిరూపించాడు. సంస్కృత కవులు ఎన్నోవిధాలుగా శృంగారమును తమ కావ్యాలలో అంతటా వర్ణించారు. ఆంధ్రప్రబంధాల శృంగారము అవధులుదాటి కన్పడుతుంది. అయినా కొందరు కొన్నిచోట్ల చక్కనిశృంగారం బాగా చెప్పారు. తిక్కన విరాటపర్వంలో ఉత్తరాభిమన్యు వివాహసమయంలో ఈవిధంగా శృంగారము చిత్రించాడు.

వరుచూడ్కి ముద్దియవదనంబుపై బారి తివుటమై నునుగాంతి తీపుగ్రోలు
సుందరీరత్నంబు చూపు మనోరము నడుగుల యొప్పు పై నల్లనడరు
పతి విలోకనములు పడతుక మైదీవ గలయంగ బలుమరు మెలగుచుండు
వెల్లది కటాక్షముల్ విభునిపై గ్రమమున నెగసి మోమున జొక్కి మగిడివచ్చు

నొండొరువుల లేజెమటల నూని ప్రేగు పడిన బొడ్డున నవయవభంగులందు దగిలి మరపున దడయు నిద్దఱ విశాల నయన దీప్తులు నెఱుకవ బయలుపడగ నూతన వధూవరుల నవప్రేమతో కూడుకొన్న ఈ చూపులు ఎంతో ముచ్చటగా ఉన్నవి. ఇటువంటి పద్యాలు భావిస్తూ ఉంటే ప్రతివ్యక్తికి తమతమ కళ్యాణసమయము జ్ఞాపకము రావడము, ఆనందపారవశ్యము కలగడము సహజము.

లలిత తనూవిలాసముల లజ్జకతంబున జేసి నున్న వి
చ్చలవిడి బట్టగా వెరవు సాలక యోరలు వాలుచూపులన్
లలితల(?)బ్రాలు వోయు నెడలందగ వొందిన నూలుకొల్పి యి
మ్ముల పచ్చంతురొండొరుల మోహనమూర్తులపై వధూవరుల్.

ఈవిధంగా ఉండే వధూవరుల లేత శృంగారమును భావించి సహృదయత్వం కలవారందరూ "శృంగార సిద్ధిరస్తు" అని తప్పక ఆశీర్వదిస్తారు.

మనసులో స్థిరంగా ఉన్న అనురాగము నానా సందేహములు వితర్కములు కలుగగా బాగా వృద్ధిపొందుతుంది. పోతన రుక్మిణి భావం ఇట్లా చెప్పాడు.

"ఘనుడా భూసురుడేగెనో నడుమ మార్గశ్రాంతుడై చిక్కెనో
విని కృష్ణుండిది తప్పుగా దలచెనో విచ్చేసెనో ఈశ్వరుం
డనుకూలింపదలంచునో! దలపడో! యార్యా మహాదేవియున్
ననపాలింప నెఱుంగునో! యెరుగదో! నా భాగ్యమెట్లున్నదో!

ఈపద్యం భావించుతూ ఉంటే మనస్సులో ఒక ప్రేమ వేదన కలుగుతుంది. ఇటువంటివానిని విప్రలంభ శృంగారము అంటారు. కాళిదాసు మేఘదూత కావ్యము విప్రలంభమును ఆధారము చేసికొని బయలుదేరింది. విప్రలంభం లేకపోతే శృంగారం చక్కగా పరిపోషం పొందదంటారు. శృంగారభేద ప్రభేదాలు చాలాఉన్నవి. కొన్నికోట్ల భేదాలు రావటానికి భోజ

రాజు బాగా విస్తరణం ప్రదర్శించారు. శృంగార ప్రకాశమనే గ్రంథము ఈ విషయంలో గుర్తింప తగినది.

అనురాగము వర్ణించడములో కవులు ఔచిత్యం పాటించాలి. ఉత్తమ ప్రకృతి కలవారికి అధమ ప్రకృతిని అనుసరించిన శృంగారం వర్ణించరాదు. దివ్యశృంగారమును మానవులకు చెప్పరాదు. మానవుల గ్రామ్యశృంగారాలను దేవతా ప్రకృతులకు జెప్పడము అనుచితము. అందువల్లనే కాళిదాసంత మహాకవినికూడ ఆలంకారికులు కొన్నిచోట్ల మెచ్చరు. ఉత్సాహాదులలోవలె రతిలోకూడా ఔచిత్యం అనుసరించాలి.

అంగప్రత్యంగాలను విచ్చలవిడిగా వర్ణించడము ఉచితముకాదు. తెనుగుప్రబంధాలలోని కొన్నిఘట్టాలను సభ్యంగా భావించడము కష్టము. నాయక రాజుల పరిపాలన సమయంలో జనులు విలాస వినోదములనే ముఖ్యంగా నిరూపించిన కవులు పచ్చి శృంగారమును చెప్పి, చదవటానికి వీలులేకుండా చేశారు. ముద్దుపళని స్త్రీ అయికూడా తాను వ్రాసిన "రాధికా స్వాంతన"మనే గ్రంథాన్ని నలుగురుజేరి స్పష్టంగా చదువుకోడానికి వీలులేకుండా చేసింది. చేమకూర వెంకన్న కొంత విశృంఖలంగా చెప్పినా ముచ్చటగా శృంగారము వర్ణించాడు చూడండి.

అర్జునుడు సుభద్రపై అనురాగంతో దేశయాత్రచేస్తూ దారిలో ఉలూచిని స్వీకరించాడు. చిత్రాంగదను ఆదరించాడు. అయినా సుభద్రానురాగంతో బయలుదేరి తాపస వేషం ధరించి వనంలో కూర్చున్నాడు. ప్రేమకల సుభద్ర

మాయామునికి సేవలు చేయడానికి వచ్చి తనకు అర్జునునిపై గల అనురాగమును మెత్తగా వెలువరించుతుంది. ఈ పద్యంవినండి.

> మీరింద్రప్రస్థము కనినారా ! పాండవుల జూచినారా!
> సుఖులై వారందరొకచో నున్నారా! వీరాగ్రగణ్యు నరు నెరుగుదురా!

ఇంతటితో సుభద్ర ఆగదు. అర్జునుడు గుర్తుకురాగానే ఆ లేత పిల్లకు అతనిరూపం గుర్తుకువచ్చి

> ఎగుభుజంబులవాడు మృగరాజమధ్యంబు పుడికిపుచ్చుకొను నెన్నడుమువాడు
> నెఱివెండ్రుకలవాడు నీలంపునికరంపు మెఱుగు చామనచాయ మేనివాడు
> గొప్పకన్నులవాడు కోదండగుణకిణాంకములైన ముంజేతు లమరువాడు
> బవిరిగడ్డమువాడు పన్నిదంబిడి డాగవచ్చు నంసపు వెన్నుమచ్చవాడు
> గరగరనివాడు నగుమొగంబువాడు చూడగలవాడు మేలైనసొబగువాడు
> వావి మేనత్తకొడుకు కావలయునాకు అర్జునుండు పరాక్రమోపార్జునుండు

ఇదంతా విని మునిగా ఉన్న అర్జునుడు

> వేమారు గ్రుచ్చిగ్రుచ్చి పు డేమీ యడిగెదవు మనసాకించుక నీకా
> భూమీశు మీద గలదో తామరసదళాక్షి నాకు దాపక జెపుమా.
> ఆకన్యడి యతివేషము చేకొనియున్నాడు నీకు చెంతనె యన్నా
> ళ్ళొకలదు వచ్చి యిక నే నీకీలక మించుకైన నీ వెరుగవుగా !

అంటాడు. ఇది దంపతులు కాదలచినవారి పూర్వానురాగరీతి.

ఎంతగా శృంగారము వర్ణించినా అంగరంగభోగములకు తగిన వస్తువుల సామగ్రి బాగా కలవారు మాత్రమె శృంగార విశేషములను బాగా కూర్చుకుంటున్నారు. ధనవంతులుకాని పామరులలో నీతిబద్ధమయిన మంచి శృంగారమున్నది. ఇది చూడండి.

> ఏత మెత్తే కాడ ఎదురూగ కూకుండి
> గోనెపట్టా యేసి గొంగడీ పైనేసి
> చల్లంగ ఉంటాది నాయెంకి
> మెల్లంగ ఉంటాది నా యెంకి -

అనేరీతిలోగూడ కోమలమయిన శృంగారము బాగానే ఉంటుంది.

పాశ్చాత్య సాహిత్యం వచ్చినతరువాత శృంగారంలో చాలా మార్పులు ప్రచారంలోకి వచ్చినవి. రసాభాస గూడ రసమనుకుంటున్నారు. ద్రౌపది అయిదుగురిపై అనురాగము కలదయినా వారందరూ భర్తలుకాబట్టి అది రసాభాసకాదు. భర్తకానివారి విషయమయిన ప్రేమ కామము మోహము అవుతుంది. అటువంటి రీతులు సమాజక్షేమము సంపాదించవు,

కవుల కావ్యాలలో శృంగారరచన చాలా మధురంగానే ఉంటుంది. స్వల్ప సమాసాలతో లలితంగా రచన ఉండాలి. ధర్మశృంగారమె శృంగారము. అది దాంపత్యధర్మము. ఈ నవీనకాలంలో ఉదాత్తమయిన పవిత్ర శృంగారమును చక్కగా ప్రచారం చేయడం చాలా అవసరము. ఈ దృష్టితోనే కొన్ని కామశాస్త్ర విషయాలను కూడ దంపతులు గుర్తించేవారట. యోగ్యమయిన శృంగారమెపుడూ హేయము కాదు. శృంగారధర్మము యోగ్యముగా ఔచిత్యంతో ఉంటే దేశక్షేమం కలుగుతుంది. ఈ శృంగార ధర్మము క్రమంగా మోక్షశృంగారముగా పరిణమించి అర్ధనారీశ్వర మహాధర్మమును ప్రసాదించుతుంది. ఈ అభిప్రాయంతోనే పెద్దలు శృంగారము " రసరాజమని " కీర్తించారు.—



## ౧౦. రసము స్థాయిభావము హాస్యము

హాసము మానవ జీవితములో కుదురుకొని ఉంటుంది. ఇతర ప్రాణులకు సుఖదుఃఖాదు లున్నప్పటికి హాసమున్నదని యెవరూ అనడములేదు. కోతి కిచకిచలాడుతుంది. అది హాసముకాదు. అది దాని స్వభావము. అన్నవస్త్రాలు, ధన ధాన్యాలు ఉన్నవారే నవ్వగలుగుతారని నియమంలేదు. దరిద్రులయినా యీ విధమయిన ప్రవృత్తి ఉంటే నవ్వగలరు. హాస్యము లేకపోతే మానవుని జీవితం కష్టంగా ఉంటుంది. ఎంతటిక్లేశమునయినా నవ్వగలిగినవారు సహించగలరు. కవిత్వము వేదాంతము మాదిరిగా మానవజీవితంలో హాస్యము ఉండితీరాలి.

హాస్యరసానికి హాసము స్థాయిభావము. హాసానికి రసాభరణకర్త ఈ విధంగా లక్షణం చెప్పారు.

క్రూరతలేని వికారా కారాద్యము లెచటనైన గలిగిన వేళన్
బోరన దో తెంచుమనోహారి వికాసంబు పేరు హాసంబయ్యెన్.

వికృతములయిన వేష. భాషాభూషలను చూచినపుడు మనస్సుకు ఒక వికాసం కలుగుతుంది. ఆ వికాసమునే హాసము అని అంటారు. కావ్యాలను భావించేటప్పుడు గూడ మనస్సుకు వికాసం కలుగుతుంది. అదీ హాసమె. మానవులలో ఉండే రాజసము వికాసానికి హేతువు. దీనికి యితరుల వికృత వేషము భాష తోడయితే హాసము బాగా పరిపోషం పొందు తుంది. విభావానుభావ సంచారి భావాలవలన పరిపుష్టమయిన హాసమును హాస్యరసము అంటారు.

బృహన్నల ఉత్తరుడిచ్చిన చొక్కాలను తిరగవేసి తొడుక్కున్నాడు. గుండీలు వీపుమీద వచ్చేటట్లు తొడుక్కున్నాడు. అపుడు ఉత్తర మొదలయిన వాళ్లంతా నవ్వారుట. ఇది వికృతవేషం. తల వెలగకాయంత పొట్ట గుమ్మడికాయం తగా ఉండేవారిని అక్కడక్కడ చూస్తూనే ఉంటాము. అది వికృతాకారము. చిన్నపిల్లలు చీరకట్టితే, పురుషులు ఆభరణాలు పెట్టుకుంటే ఎవరికి నవ్వురాదు? ఈపద్యంవినండి.

శౌరి రఘుప్రభుండు రవిజాత పయోనిధి యంచు గోపికల్
తోరపుతీగ తోకలును దోఃపదయానము పూని వానరా
కారమెలర్ప దాటుచును గంతులు వేయుచు బారుతెంచి త
త్తీర నగంబునన్ శిలలు దెచ్చి గుభుల్లున వేసి రార్చుచున్.

శ్రీకృష్ణుడు శ్రీరాముడని యమునానది సముద్రమని గోపికలు కోతివేషాలతో రాళ్ళు విసరివేశారుట. ఇది నవ్వుగానే ఉంది.

నిక్కి జటాపుటస్థతటినిం దన తొండముసాచి పీల్చియా
చక్కటి గౌరి చూడ నిలజల్లిన పెక్కు ముఖంబులై జనన్
గ్రక్కున శూలి హస్తదశకంబున నాపినభంగి నూచి మై
గ్రక్కదలంగ నవ్వుచున్ గంతులు వేసె గజాస్యు డుబ్బుచున్.

వినాయకుడు తండ్రి శిరస్సుపైని గంగలోని జలమంతా తొండముతో పట్టి ఒలకపోశాడు. అన్ని దిక్కులకు ఆ జలం ప్రవాహంగట్టి ప్రసరిస్తూ ఉంటే శివుడాపుతున్నాడు. పార్వతికి తన కొడుకుచేష్ట సంతోషంగానేఉంది. ఇదంతా చూస్తే వినాయకుడికీ నవ్వువచ్చింది. ఇదంతా భావిస్తే మనకూ నవ్వు వస్తుంది. ఈ హాసం ఈ విధంగా హాస్యరసమవుతుంది.

సంస్కృత రూపకాలలో ప్రహసనమని ఒకటి ఉన్నది. దానిలో హాస్యరసం ముఖ్యంగా ఉంటుంది. నాటకాలలో విదూషకుడు హాస్యగాడు. సంస్కృత భాషలో హాస్యం అంత ప్రధానంగా లేదు. ఎక్కడయినా ఉన్నా సభ్యంగా ఉండదు. శృంగారానికి అంగంగా ఉంటుంది. హాస్యము స్వతంత్ర రసముగా లేదు. అలంకారికులు ఆవిధంగా భావించనూ లేదు. భ్రష్టతాపసులు వేశ్యా చేట నపుంసక విట ధూర్త బంధకీ జనము హాస్యానికి ఉండాలని భావించారు. ఇటువంటి హాస్యాన్ని సభ్యంగా భావించలేము.

మన తెనుగు ప్రబంధాలలో గూడ హాస్యము అంత బాగా ఉన్నట్లు కనబడదు. సమకాలములోని సంఘమునుబట్టి హాస్యరీతి మారుతూ వచ్చింది. వ్యక్తులను హీనంగా నీచంగా చూసే హాస్యమును మనము అభినందించలేము. అయితే ఒకటి ఉంది. సంఘంలో వ్యక్తులు రెండురకాలు ఉంటారు. నేను పాలించాలి. అనుభవించాలి అని తలచేవారు. నేను పాలింపబడాలి. అనుభవింపబడాలి, అని తలచేవారు. దీనిలో మొదటిరకంవారు యితరులను వెక్కిరిస్తారు. అటువంటిరీతులనుగూడ మనము హాస్యము అనుకోవలసి వచ్చింది. పరిహాసంగాఉండే పాటలు స్త్రీలల్లో ఎన్నో ఉన్నయ్. వరస పాటలు యిటువంటివేగా !

కోడలు అత్తతో అంటుంది :—

నీకడుపుచల్లన నీకొడుకు బ్రతుక
నీవుపోయి స్వర్గాన ఏకుల్లు వడుక

బావతో మరదలు అంటుంది :—

బావగారూ మీరు ప్రతిభగలవారు
నిండినసభలోన పిండితోక్కేరు.

మఱది అంటాడు :—

వదినగారూ మీరు వాసిగలవారు
వండబోయినచోట కుండనాకేరు.

ఇటువంటిహాస్య మీనాడు ఎవరికీ వద్దు. సరసాలన్న పేరుతో అశ్లీలములు మోటుమాటలు సభ్యతకాదు. ఉపన్యాసాలు చెప్పేవారికి కాస్త హాస్యం ఉండాలని "ఆంధ్రరత్న" అనే వారుట. ఉపాధ్యాయులకిది అవసరంగానే ఉంది. లేకపోతే పిల్లలు సరిగా వినరు. వారిని ఆకర్షించడానికి హాస్యమవసరము. చక్కగా చదువుకొనినవారు గోష్ఠిగాచేరి మాట్లాడుకొనే టప్పుడు సభ్యమయిన హాస్యమున్న వ్యక్తి శోభించడం ప్రసిద్ధం.

మామూలుగా మాట్లాడుకొనే మాటలకు అర్థాంతరాలు చెప్పి కొందరు నవ్విస్తారు.

"ఒసేవ్! సమకాలురు అంటే నీకు తెలుసూ! పొట్టీ పొడుగులేక రెండుకాళ్ళు సమంగా ఉన్నవన్నమాట" అని మా శకుంతల అంటుంది. ఇదేవిధంగా మాటలకు పెడర్థాలు చెప్పడంగూడ హాస్యమె.

తోలుబొమ్మలాటలోని కేతిగాడు బంగారక్కల హాస్యము మనకు వద్దంటాను. అది గౌరవంగాలేదు. హాస్యరీతి పురుషులలో అధికంగా ఉంది. వారు జంకులేకుండ పలకడానికి అలవాటుపడి ఈ ప్రఖ్యాతిని అనుసరించారు. స్త్రీలలో హాస్యప్రవృత్తి బాగా వికసించలేదు. ఇది సభ్యంగా ఉండదేమో! ఎవరైనా ఏమైనా అనుకుంటారేమో! నొచ్చుకొంటారేమో!

అని వనితలు సుకుమారంగా సందేహిస్తారు. హరికథలు చెప్పే వారు చూడండి! స్త్రీలనే విమర్శిస్తూ పురుషులను నవ్వించడానికి యత్నిస్తారు. ఇదీ హాస్యమేనా?

ఏదైనా విషయం గంభీరంగా చెపుతూ హాస్యం మాట విసరితే అది ప్రకృత విషయాన్ని చెదరకొడుతుంది. హాస్యము ఆరువిధాలుగా ఉంటుంది. స్మితమనేది మొదటి రకము. విడీవిడని పెదవులతో నేత్రాలతో నవ్వుతారు. అపహసితము చివరిరకము. పొట్టపట్టుకొని వళ్ళు విరగబడుతూ నవ్వుతారు. కాని వినేవాళ్లకు ఏడ్చినట్లుంటుంది. కళ్ళవెంట వారి భాష్పాలు ఉంటవిగా! ప్రాచీనులకు హాస్యభేదాలు చాలా తెలుసు. అయినా విరివిగా వర్ణించలేదు. "హాస్యం స్వతో నిష్ఫలం" అని వారనుకున్నారేమో! వారి దృష్టిలో హాస్యము స్వతంత్రరసము గాదు.

నవీనకాలంలో హాస్యానికి కొంత ప్రాధాన్యము వచ్చింది. ప్రతి నాటకంలోనూ హాస్యమే. ప్రతి సినిమాలోనూ ఎవరినైనా వెక్కిరించడం తప్పడంలేదు. ఏ పత్రికలోనైనా హాస్యరచన ఉండకపోవడంలేదు. తమాషాలు అనే పేరుతో ఎన్నో వస్తున్నవి. తలిసెట్టి వారి చిత్రములు హాస్యానికే. ఎంతైనా యివన్నీ ఎగతాళి వెక్కిరింపు వెటకారంలోనికి దిగినయ్.

ఒక రచయిత పందికొక్కుని ఈవిధంగా వర్ణించారు.

నిర్నిద్రవిషయుక్త నిశిత దంష్ట్రిలబూని భేదించు నెటువంటి గాదెనైన
దారుణోద్యద్దంత తతి చేత ఖండించు గురుతుగా నెటువంటి కోకలైన
పటు సురంగాగార ఖనితంబుగా త్రవ్వ పొరికాన నెటువంటి భూమినైన
కీచుకీచుధ్వని ప్రాచుర్యమహిమచే వర్ణించు నెటువంటి వార్తనైన

ఆతడు సామాన్యుడే నరేంద్రాలయాంతరంతారానేక పేటికాక్రాంత వస్తు హరణ సురధాణి యవ్వనాయకుపతాణి చారుతరమూర్తి మూషక చక్రవర్తి. ఇది విన్నవారికి నవ్వురావచ్చు. చాలా హీనమయిన పంది కొక్కును ఈ విధంగా వర్ణించడమేమిటని. సాటివాళ్ళని విమర్శించుతూ తిరిగే ఒక కవి వెక్కిరించడం ఈ పద్య తాత్పర్యమని అనుకోకపోయినా ఇటువంటి కొక్కిరాయి కవిత్వాలు నవ్వుపుట్టించగలవు.

సంఘంలోని ఆచారాలు కొన్ని మంచివికావనే భావనతో వానిని సంస్కరించాలని కొందరు హాస్యరచనలు చేశారు. కందుకూరి, చిలకమర్తి, పానుగంటి మొదలయిన పెద్దలు ఈ దృష్టితో హాస్యం చిత్రించారు. పరిహసింపబడే వ్యక్తిగూడ మనతోబాటు సమంగా సంతోషించాలిగాని బాధపడరాదు. అటువంటిదే మంచి హాస్యము.

ఒకడు వంటచెరకు అమ్ముతున్నాడు. "ఏమయ్యా! ఇవి యెండువేనా?" "ఏదీ మెలేసిచూడు నీళ్ళు పడడంలేదు గదా?" ఇటువంటి మాటలలో హాస్యం ఎవరినీ బాధపెట్టదు.

వైద్యులిద్దరూ ఒకేసారి రోగి నాడీపరీక్ష చేయదలచుకొని శాలువాక్రిందిగా చేతులు పెట్టారు. ఒకరుచేయి ఒకరు పట్టుకుని "బాగానేవుంది. జబ్బేమీ లేదే! నాడి నిషాగా ఉంది" అన్నారుట. ఈ హాస్యము వైద్యులకు బాధగా ఉంటుంది.

ఒకపిల్ల రాగికాని మింగింది. వైద్యునిదగ్గరకు తీసుకుని వెళ్ళారు. "ఎట్లాగైనా కానీ తీయండి. మీకెంతైనా యిస్తాను. పిల్లను రక్షించండి" అని తల్లి ఆదుర్దాగా అడిగింది. "నాకు చేతగాదమ్మా! ఆప్లీడరును పిలవండి ఎక్కడున్న కానీనైనా

ఆయన లాగుతాడు” అని వైద్యుడన్నాడుట. ఈ హాస్యము ప్లీడర్లకు బాధ.

ఏ వ్యక్తీ ఏ సంఘమూ ఏ సంప్రదాయమూ బాధపడకుండా సభ్యమయిన హాస్యమయితే ఆనందప్రదమవుతుంది. ఆరోగ్యమూ యిస్తుంది. ఇంతవరదాకా వచ్చిన వెక్కిరింపు హాస్యము మనకక్కరలేదనిపిస్తోంది. కాని జనులు హాస్యద్వేషులు కాకుండా మంచి హాస్యమును ఆదరించవచ్చు. నమస్కారము.



## ౧౧. రాజయోగము

పండితులయిన పెద్దలు వేదవేదాంతములను తెలుసుకుంటారు. అవి అందరకూ అందుబాటులో ఉండవు. వాదాలు శాస్త్రార్థాలు లేకుండా ఉండే లఘువేదాంతము సామాన్య ప్రజకు చాలు. ప్రజల జీవనములలో మామూలు సుఖాలు కాక గొప్ప ఆనందమును గూర్చేవి కూడా కావాలి. ఆ గొప్ప ఆనందమె ఆత్మానందము. ఆత్మానందమును లక్ష్యముగా పెట్టుకొని ప్రవర్తించితే ఏమీ అనర్థం రాదు. వేదాంతములో ఆ ఆనందం లభిస్తుంది. సామాన్యప్రజలు గందరగోళం లేని లఘువేదాంతమును కోరుతారు.

సామాన్యంగా వేదాంతములో “ఈ ప్రపంచం ఏమిటి? మనం ఎవరం? ఎందుకు ఈ విధంగా వచ్చాం? ఆత్మ అంటే ఏమిటి? అది పొందడానికి మనం ఏంచేయాలి?” అనే విషయాలు ఉంటవి. ఉత్తుత్తమాటలతో వేదాంతాలు చెప్పుకుని

ప్రయోజనం లేదు. దానికి తగిన సాధన బాగా ఉండాలి. సాధన మంచి అనుభవమును సంపాదించి పెడుతుంది. ఆ అనుభవం లోకంలో సాధన చేయదలచిన వారికి బాగా ఉపయోగిస్తుంది.

భృగువు అనే ఒక పిల్లవాడు ఉన్నాడు. వాళ్ళ నాన్న దగ్గిరికి వెళ్ళి "నాకు బ్రహ్మ అంటే యేమిటో చెప్పు నాన్నా!" అన్నాడు. "ఈ జగత్తుఅంతా దేనివల్ల పుట్టుతున్నదో దేని వలన బ్రతుకుతున్నదో దేనిలో లయించుతుందో అది బ్రహ్మ. అది తెలుసుకో" అన్నాడు. భృగువు "సరే బాగుంది" అనుకొని తపస్సు చేశాడు. తండ్రి దగ్గరకు వచ్చాడు. "నాన్నా! బ్రహ్మను తెలుసుకున్నాను. అన్నము బ్రహ్మ" అన్నాడు బ్రహ్మకు చెప్పిన లక్షణాలు అన్నానికి ఉన్నవి అనుకున్నాడు "అన్నం ఉంటేనే ప్రాణులు పుట్టుతున్నవి. అన్నమువలననే బ్రతుకుతున్నవి. అన్నంలోనే లయించి పోతున్నవి. అందు వలన అన్నమే బ్రహ్మ" అని భృగువు అన్నాడు. కాని ఏదో సరిగా తెలిసినట్లుగా లేదు. "నాన్నా! నాకు బ్రహ్మ చెప్పు" అని మళ్ళీ అడిగాడు. అప్పుడు తండ్రి "ప్రత్యేకంగా తపస్సు చేసి బ్రహ్మను తెలుసుకో" అని ఒకవిధమైన తపస్సుకూడా చెప్పాడు. ఆ తపస్సే ఆత్మసాధనం. తరువాత ఆ పిల్లవాడు నాన్న చెప్పినవిధంగా తపస్సుచేసి ప్రాణం బ్రహ్మ అని అనుకున్నాడు. మళ్ళీ తపస్సు చెయ్యమంటే చేసి మనస్సు బ్రహ్మ అని అనుకున్నాడు. ఇట్లాగే విజ్ఞానము బ్రహ్మ అనుకున్నాడు. తుదకు ఆనందము బ్రహ్మ అని తెలుసుకున్నాడు. అన్నము నుండి ఆనందముదాకా ఆ భృగువు ఎన్నోవిధాలుగా తపస్సు

చేశాడు. సాధన చేశాడు. ఎంతో అనుభవం సంపాదించి ఆత్మ గుర్తించుకొన్నాడు. ఇదంతా ఆతని జీవితంలో మంచి వేదాంతానుభవము.

ఆతడు అంత అనుభవం సంపాదించటానికి ఎంతకాలం సాధనచేశాడో? ఆ సాధనమే యోగం. ఇటువంటి యోగమును అనుభవం కలవారి దగ్గర నేర్చుకోవాలి. పుస్తకమును చూచి మాటలు విని సంపాదించగలమా!

వేదాంతములో సాధనమనేది యోగంకదా! యోగం అంటే మనస్సును నిశ్చలం చేయటం. మనస్సులో కలిగే ఊహాలను అవతలకు నెట్టి ఏకాగ్రంగా ఉండాలి. ఈ యోగం నాలుగురకాలు.

మంత్రయోగమనీ హఠయోగమనీ లయయోగమనీ రాజయోగమనీ, పెద్దలు విభాగం చేశారు. రాజయోగంలో చక్కగా విషయమును విచారణ చేస్తారు. అందువలన రాజయోగం విచారణ ప్రధానమైనయోగమని పండితులంటారు. ఆత్మను లక్ష్యంగా పెట్టుకొని ధ్యానంచేయడం దీనిలో ముఖ్యం. రాజయోగము ఇతరయోగములకంటె చాలామంచిదంటారు. రాజయోగములోని విషయాలను ఎవరూ కాదనరు. అందరూ ఒప్పుకుంటారు. రాజయోగమును అవలంబించేవారు సమాధిలో మృత్యువును గూడా జయింపగలుగుతారు. అటువంటివారు స్వేచ్ఛామరణం కలవారుట. చచ్చిపోవాలనుకుంటే సుఖంగా ప్రాణాలు విడువగలరు. చిరకాలం ఆత్మానుభవం పొందుతూ ఉండాలనుకుంటే సమాధిసుఖంలో ఉండాలనుకుంటే ఎంతకాలమైనా బ్రతుకుతారు. అందువల్లనే

ఇది రాజవిద్య రాజయోగము అని సంతోషంతో మెచ్చుతున్నారు.

రాజయోగి ఎల్లప్పుడూ ఆనందంగా ఉంటాడు. భక్తితో జీవయాత్ర సాగిస్తాడు. రాజయోగి దేహం మంచికాంతితో ఉంటుంది. ఆకాంతి ఎక్కడిది ? అది లోకంలోని మెరుగు వస్తువులతో వచ్చేదికాదు. దివ్యసుందరరూపముకల భగవానుని రాజయోగి ధ్యానించుతాడు. తేజస్సును ధ్యానంలో తెలుసుకుంటాడు. అదే అతనికి లభిస్తుంది. అందుకనే రాజయోగులకు ధ్యానం చాలా ముఖ్యం. ఈ ధ్యానంలో పరమాత్మయందు ప్రీతికలిగి అభ్యాసంచేయాలి. చిత్తశాంతిని పొందాలి. జీవాత్మ పరమాత్మల అభేదమును తెలుసుకోవాలి. ఇటువంటివాడు రాజయోగి. ఈతడు రాజభోగివంటి వాడవుతాడుట. రాజయోగి నిత్యము తన యోగాభ్యాసములో సమాధిస్థితిని అందుకుంటూ ఉండాలని సీతారామాంజనేయంలో ఉంది. వినండి.

గాలంబు లేనిచో జాలకాగ్రణిచేత పాఠీనజాలముల్ పట్టువడునే
సరి యురి లేనిచో శకునాంతకునిచేత చొక్కంపు పక్షులు చిక్కువడునె
ఓదంబు లేనిచో నొగి మావటీనిచే గజరాజములు నరి కట్టువడునె
తగు కోల లేనిచో మృగయావినోదిచే ఘోరమృగంబులు కొట్టువడునె!
రాజితానంద తారక రాజయోగ పావన సమాధి లేనిచో, పరిమ శుష్క
తర్క వేదాంత వాద తత్పరులచేత నింద్రియ మనంబులువినిగ్రహింపబడునె

ఇంద్రియములను మనస్సును చక్కగా నియమించుకొని నిగ్రహించుకుంటేనేగాని రాజయోగమురాదు. ధ్యాన సమాధి నిత్యము అలవాటులో ఉంటే ఇంద్రియ మనములను నిగ్రహించుకోవచ్చు. రాజయోగాభ్యాసం చేసే వారికి ఆహారాది నియమాలుండాలి.

వనరుచు నేమియుం దినని వానికి మిక్కిలి వెక్కసంబుగా
తిని యెగబోయు వానికిని తీరని నిద్దుర యెల్ల ప్రొద్దు పై
కొనబడి యుండు వానికిని కొంకక రేపగలొక్క రీతి మే
ల్కొని వసియించు వానికి నగోచరముల్ పరయోగలక్ష్యముల్.

మితిలేక భోజనం చేయరాదు. బొత్తిగా ఉపవాసాలూ చేయరాదు. ఎప్పుడూ మొద్దునిద్ర పోరాదు. బొత్తిగా నిద్ర మానరాదు. అందుకనే

యుక్తాహార విహారుడు యుక్త స్వప్నావబోధు డురు కర్మములన్
యుక్త విచేష్టుండగు, ఘన యుక్తునకగు పరమ రాజయోగము సుఖమై.

నిద్రాహార విహారములు తగినంతగా ఉంటే చక్కగా రాజయోగం అలవడుతుంది. యోగం ఆచరించేటప్పుడు చాలా నియమాలుండాలి.

వితతమై విజనమై విమలమై సుఖమై పొసంగు వివిక్త దేశమ్మునందు
సమభూమి యందు నిశ్చలముగా మిట్టు పల్లములు గాకుండ పేలవముగాగ
వరుస కుశాజిన వస్త్రంబు లనువుగా పఱచి యొప్పుగ వానిపై తిరముగ
పూని పద్మాసనాసీనుడై యామీద కాయమధ్యమమును గళము శిరము
చక్కగా నిక్కి దృక్కులు ముక్కు చక్కి చిక్కదక్కించితిక్కి నదిక్కు కనక
మిక్కిలిదశేంద్రియంబుల ద్రుక్కజేసి ఫలితముగ యోగమభ్యసింపంగవలయు.

శరీరము కదలకుండా మాటలాడకుండా కామక్రోధాది వికారములు లేకుండా గురువుపదేశించిన లక్ష్యముపై మనస్సును నిలిపి రెండు జాముల కాలము పూనికతో యోగాభ్యాసము చేయాలని సీతారామేంజనేయకర్త నిరూపించాడు.

ఇంతగా రాజయోగమవలంబిస్తే కలిగే ఫలమును ఈవిధంగా అనుభవజ్ఞులు చెప్పుతున్నారు.

స్థూలశరీరంబు సుస్థిరంబుగనుండు సకలేంద్రియము లుపశాంతి దొందు
సన్మన. పవనముల్ సంచలింపక యుండు కామాది శత్రువర్గము నశించు
స్ఫురదమానిత్వాది సుగుణముల్ సమకూరు ఘనగుణాతీత లక్షణము నొదవు
పొలుపారు వైరాగ్య బోధోపరతులు సంపూర్ణంబులై మది పొదలుచుండు

పరమ సుఖవార్ధి యుప్పొంగి పొరుచుండు
ముందట వసించు మోహించి మోక్షలక్ష్మి
సంశయము లేక దృఢముగా సంతతంబు
సర్వమును బ్రహ్మమని చూచు శాంతనిధికి.

రాజయోగము అవలంబించేవారికి మంత్రముకూడా అవశ్యంగా ఉండాలి. ఆ మంత్రమును కూడా పెద్దల అనుమతితో యోగ్యులయిన గురువు దగ్గర ఉపదేశం పొందాలి. మంత్రమును నియతంగా జపించితే మంత్రశక్తులు యోగం చేసే వారికి చాలా సహాయంగా ఉంటాయి.

పతంజలి అనే మహర్షి రాజయోగమును యోగసూత్రమనే సంస్కృత గ్రంథంలో నిరూపించారు. యోగము ఎనిమిది విధాలు. దీనినే అష్టాంగయోగము అంటారు. దీనిని నియమంగా అలవాటులో పెట్టుకుంటే రాజయోగులు కావచ్చు. ఈ యోగం అవలంబిస్తూ మనస్సును నిశ్చలంగా చేస్తే ఆకలిదప్పికలు పోతవని, అణిమ మొదలైన సిద్ధులు కలుగుతవని, ఇతర లోకాల విజ్ఞానం కలుగుతుందని, ఇంకా చాలా యోగసిద్ధులు కలుగుతవని అంటారు, కాని అసలు యోగసిద్ధి ఐన ఆత్మస్థితికి ఇవన్నీ విఘ్నాలు. కనుకనే సమాధి సుఖానికై రాజయోగులు ప్రయత్నం చేయాలి.

ఈశ్వరధ్యానం చేయాలి అని యోగసూత్రంలో ఉంది. ఆవిధంగా ధ్యానయోగం అవలంబించటం రాజయోగికి చాలా ముఖ్యం. ప్రాణాయామము చేయడము దీనిలో ఒక ముఖ్య సాధనము. గాలిని నియమానుసారంగా లోపలికి పీల్చి కొంత సేపు నిలబెట్టి ధారణచేసి మళ్ళీ విడవాలి. సామాన్యంగా

ఇది ప్రాణాయామం లక్షణం. తన ఎదట ఉన్న ప్రపంచము నంతా తనలోనికి భావనతో ఆకర్షించడం, లోపల దృఢంగా ధరించడం, మనస్సులోని సంకల్ప వికల్పముల నన్నిటినీ విడిచి పెట్టడం ఈ ప్రాణాయామంలో ఉంటుంది.

ఈ విషయంలో భారతంలో ఒక చక్కని చిన్నకథ ఉంది. సూర్యోదయం అయ్యేటప్పటికి నీ భర్త గతించుతాడని ఒక ఋషిపత్నికి శాపం వచ్చింది. అందుకని ఆ పతివ్రత రాజ యోగం అవలంబించేది కాబట్టి ప్రాణాయామములో ప్రపంచ మును ఆకర్షించి సూర్యుణ్ణి తన మనస్సులోనే ధారణ చేసిం దట. ఎన్నిగంటలు దాటినా సూర్యుడు ఉదయించనే లేదు. అప్పుడు బ్రహ్మవచ్చి ఆమెను బ్రతిమలాడి. సంజీవనితో భర్తను బ్రతికించడానికి ఒప్పించి మళ్ళీ సూర్యోదయం అయ్యేట్టు చేశాడట. ఇంతకూ యోగంవల్ల అసాధ్యం లేదని మన గ్రంథాలు చెప్తున్నై.

మన దేశాన యోగులు యోగినులు ఎందరో ఉండే వారు. ఈనాటికిన్నీ ఆ విశేషాలు కొన్ని ఉన్నాయి. రాజ యోగమును అవలంబించి ఉత్తమధ్యానమును అలవరుచు కుంటే చక్కని ఆరోగ్యమూ విజ్ఞానమూ కలుగుతుంది. శివుడు యోగీశ్వరుడు. విష్ణువు యోగేశ్వరుడు.

తన అభీష్టానుసారముగా పరమేశ్వరుని ధ్యానించి యోగమును అభ్యాసంలో ఉంచేవారికి చక్కని ఆత్మానందం కలుగుతుంది.



౮-౪

# ౧౨. స్త్రీ దేవతలు

విద్యాస్సమస్తాః తవ దేవి భేదాః
స్త్రియః సమస్తాః సకలా జగత్సు
త్వయైకయా పూరితమంబయైతత్
కా తే స్తుతిః స్తవ్యపరా పరోక్తిః.

"దేవీ! సర్వవిద్యలు నీరూపములె. ఈ ప్రపంచంలో ఉన్న స్త్రీలందరూ నీ రూపమె. ఓ జగదంబా! నీవే ప్రపంచమంతా వ్యాపించి ఉన్నావు. నీకింకా స్తుతి ఏమిచేయగలము". పరమేశ్వరీ స్తవం చేస్తూ పైవిధంగా పురాణములు చెపుతున్నవి. స్త్రీలందరూ పరమేశ్వరీ స్వరూపమని భక్తులందరు అంటున్నారు. స్త్రీ దేవతలు అనే విషయమును భావించగానే దేవతలలో స్త్రీలుగా ఉన్నవారిని గురించి ముచ్చటించాలి అని అనిపిస్తుంది. కాని మన భారత దేశంలో స్త్రీ లందరూ దేవతలే. వారి చరిత్ర వారి విశేషము కొంతగా గుర్తించితే స్త్రీ దేవతలను పలికినట్లే అవుతుంది.

"యానారీ ప్రయతా దక్షా యానారీ పుత్రిణీ భవేత్
పతివ్రతా పతిప్రాణా సానారీ ధర్మభాగినీ."

స్త్రీఅంటే సర్వకార్యములలోను ప్రయత్నము కలది కావాలి. అన్నిపనులలోనూ సమర్థురాలు కావాలి. పుత్రసంతానము కలది కావాలి. పతివ్రతయై పతికి ప్రాణసమానయై ఉండాలి. ఆమె సకల ధర్మములను సంపాదించేది కాగలదు. స్త్రీని గురించి ఈ విధంగా చెపుతున్నారు. ఈ రూపాన ఉండే స్త్రీ "దేవత" అనే అనాలి. స్త్రీగా ఉన్న "దేవత" ఈ ప్రపంచమును సృష్టించినదని మనము పురాణాలలో వింటున్నాము.

ఆ పరమేశ్వరిని "విశ్వజనని" "పరాశక్తి" "దుర్గాదేవి" "జగన్మాత" అని మనము భావించుతాము. ఈ రూపముతో భావించి త్రిమూర్తులు పరమేశ్వరిని నానావిధాల స్తోత్రములు చేశారు. ఆ స్తోత్ర పద్యములు దేవీభాగవతములో విస్తృతంగా ఉన్నవి.

మ్రొక్కెదనంబకున్ ప్రసవదమోఘ కృపారస దృక్కదంబకున్
మ్రొక్కెద తల్లికిన్ చరణమూలనమజ్జన కల్పవల్లికి
మ్రొక్కెద సిద్ధికిన్ విషయ మోహ నిరాస పదైక బుద్ధికిన్
మ్రొక్కెద మాయకున్ సుర సమూహ వచో రచనానుగేయకున్.

మహనీయులయిన కవులు రచనచేసిన పద్యాలన్నీ మనవంటివారు నిత్యమూ పఠించడానికి తగియుంటవి. దేవతలందరూ స్తోత్రాలుచేయగా పరమేశ్వరి తాను యీవిధంగా చెప్పింది.

నానా నాకనివాస బృందములు నానా నామ చేష్టాదులన్
నానా రూపములన్ వశించి విహృతుల్ నానాస్థితిన్ సల్పుదున్
మాని వ్రాతము లిల్లెరుంగుదురు సన్మానించి యొక్కొక్కచో
నానాశక్తి విభేదమొంది జగతిన్ నర్తింతు నిచ్ఛారతిన్."

"నేను నానాదేవతల రూపాలతో ఉంటాను. నానాశక్తులతో నేను ఉంటాను. జగమంతటా నేను వ్యాపించి ఉన్నాను." అని పరమేశ్వరి చెప్పింది. బ్రహ్మదగ్గరనున్న సరస్వతి పరదేవీ స్వరూపమె. నీ సహచారిణిగా తీసుకో అని సరస్వతిని సమర్పించింది. ప్రపంచమును సృజించటానికి నా ఈ శక్తి నీకుపకరించుతుంది." అనినీన్ని పలికింది. ఆ తరువాత శ్రీ విష్ణువును జూచి ఆదిశక్తి మహాపరమేశ్వరి ఈవిధంగా అన్నది.

సారసనేత్ర ! నీవునిక సన్నుతగాత్ర జగత్రయీమహో
దారచరిత్ర ఈ సకియ దారగ జేకొను మీమె లక్ష్మి
వక్షో రమణీయ పీఠమునకున్ దగియున్నది నావయస్య శ్రీ
డారతి నేలుకొమ్ము ప్రకటప్రతిభన్ సకలార్థదాయినిన్.

అవమానంబునకోర్వ దింతయును నిత్యాభోగ భోగార్థివై
పవలున్ రేయి సుఖింపుమీ రమణి శోభామూర్తియై నీయెడన్
బ్రవిభాగం బిసుమంత లేక సకలార్థ ప్రక్రియన్ గూర్చుచున్
గవలై యుండెడు మాటలన్ నడవడిన్ గామోత్సవోల్లాసరై.

లక్ష్మీదేవిని స్వీకరించవలసింది అని చెప్పినది. ఆ లక్ష్మీదేవిని లోకమారాధింపవలసిన విధమునుగూడ నిరూపించినది.

శివునిజూచి చేరపిలిచి ఈవిధంగా అన్నది. "నాకు ప్రియసఖి ఈమె. మహాకాళి. మనోహరాంగి. గౌరకాంతి. దీనిని స్వీకరింపుము. ఈ గౌరీదేవి తమోగుణముతో ఉంటుంది. అయినా సత్వ రజోగుణాలు ఈమె యిచ్ఛాధీనములుగా వుంటవి. నీవు పరాత్మ చింతలలో సత్వగుణముతో తపస్సులాచరించుతూ నన్నూ ధ్యానించుతూ ఉండవలసినది. నీవీ గౌరిని స్వీకరించు." అని పరమేశ్వరి త్రిమూర్తులకు మూడు శక్తులను ప్రసాదించింది. ఆ ముగ్గురు మనకు ఆరాధింపతగిన "స్త్రీ దేవతలు" అందరకూ విద్యలు కావాలి. విద్యాభిలాష కలవారందరూ సరస్వతి నారాధించుతారు. అందరకూ సంపదలు కావాలి. సంపత్తుల అభిలాష కలవారందరూ మహాలక్ష్మి నారాధించుతారు. అందరకూ ఆపదలు పోవాలి. శక్తులు రావాలి. అందుకై మహాకాళిని ఆరాధించుతారు. ఈవిధంగా "స్త్రీ దేవతా" రాధన అంతటా వ్యాపించి ఉంది. అవశ్యంగా ఈ నవరాత్రాలలో "మహాకాళి" "మహాలక్ష్మి" "మహాసరస్వతి" స్వరూపంగా ఉన్న "పరదేవి"ని మనము ఆరాధించుతున్నాము. ఈదినాలలో దుష్టవ్యాధులు గలుగజేసే యమునికోఱలు ప్రజల ఆరోగ్యమును పోగొట్టుతవట. ఆ

యిబ్బందులు లేకుండా జేసికొనడానికి మనము ఈ దేవతలను ఆరాధించాలి. ఈదినాలలో ఈ "స్త్రీ దేవతా" రాధనము అందరూ చేయాలి. ఇట్లాచేయని వారిని దేవీభాగవతము వెక్కిరించుతున్నది.

అఖిలాండజనని నిత్యార్చనలేనట్టి కొంపగాదిది కోళ్ళగంపగాని
త్రిపురసుందరి దృష్టి తీర్పని యన్నిచు సిరులుగావవి కొండచరులుగాని
ఆదిశక్తిని గూర్చి యర్చసల్పనివాని కేలుగాదది బండికేలుగాని
అంబికనెప్పుడు అభినుతింపనివాని నోరుగాదది కట్టెవేరుగాని
భగవతికొసంగలేని దుర్భగుడుగూర్చు ధనముగాదది నరకసాధనము గాని
ధారుణీశ్వర ! తెలియంగలేరు జనులు తల్లి జగదంబ నతకల్పవల్లి సుమ్మ.

ఒకప్పుడు శ్రీవిష్ణువు దేవీమఖము నిర్వహించాడు. దానినే దేవీయాగమంటారు. మహారాజులు కొందరు తమ యిష్టసిద్ధికై "మహేశ్వరి"ని ఆరాధించారు. వారందరూ కేవలము తమ ఇష్టమును సంపాదించుకొనుటకేగాక పరమేశ్వరి ప్రభావము తెలుసుకోడానికి ఆత్మానందము పొందడానికి పరమేశ్వరిని ఆరాధించారు. వారికథలు చాల విశేషంగా గ్రంథాలలో ఉన్నవి. ఆ కథలను పురాణాలలో భక్తులు చెప్పే కథలలో మనము తెలుసుకొంటూనే ఉన్నాము.

ఈశ్వరేశ్వరి కటాక్షేక్షణంబులు మోహారక్షోభయార్త సంరక్షణములు.
ఈశ్వరేశ్వరి కటాక్షేక్షణంబులు ఘోరభవభీతిదుర్మార్గభక్షణములు
ఈశ్వరేశ్వరి కటాక్షేక్షణంబులు నవ్యచిత్త సంబోధనాశిక్షణములు
ఈశ్వరేశ్వరి కటాక్షేక్షణంబులు మహాదురితదావాగ్ని సంధుక్షణములు
స్వమతసిద్ధాంత వాచావిచార భేద బోధబోధక జనన ప్రభేద జనన
ధర్మకర్మక జిహ్వాకాతక్షణంబు లీశ్వరేశ్వరి సత్కటాక్షేక్షణములు.
చిచ్ఛక్తి భజియించు చిత్తంబు చిత్తంబు మాహేశ్వరిదలంచు మనముమనము
కాత్యాయనిని బూన్చు కరములు కరములు భువనేశి గాంక్షించు బుద్ధి బుద్ధి
విమలవిద్యను విను వీనులు వీనులు పరమేశ్వరి నుతించు పలుకు పలుకు
బ్రహ్మణి వలగొను పదములు పదములు శ్రీదుర్గ నుతియించు జిహ్వా జిహ్వా

ఇష్టకామేశ్వరిని గను దృష్టి దృష్టి చిన్మయీ శక్తికి మ్రొక్క శిరము శిరము
మాటలేటికి పరదేవి మహిమ గనని నరుడు నరుడౌనె కుటిల వానరుడు గాక.

శ్రీరాముడు శ్రీకృష్ణుడు అవతారపురుషులైనా దేవి నారాధించారు. దేవి వారికి వరాలిచ్చింది. వారు కృతార్థులయినారు. ఇటువంటి కథలు చాల విశేషంగా పురాణాలలో కన్పడుతున్నవి. దేవీ భాగవతంలో ఐదవ స్కంధమునుండి దేవీపూజా విశేషాలు మాహాత్మ్యములు చాల విపులంగా ఉన్నవి. మహిషాసురమర్దనీ మహాదేవి చరిత్ర ఈవిధంగా ఉంది. మహిషాసురుడనేవాడు పదివేల సంవత్సరాలు తపస్సు చేశాడు. బ్రహ్మ ప్రత్యక్షమై వరము కోరుకోమనగా జరామరణాలు లేకుండా అమర భావముతో నుండేటట్లు వరమిమ్మన్నాడు. భూమిలో పుట్టినవానికి మృత్యువు తప్పదు. చావుపుట్టుకలు అంతటా ఉండేవే అని బ్రహ్మ అన్నాడు. "పురుషుల వలన తనకు చావులేకుండా ఉండాలి." అని మహిషాసురుడు వరం కోరుకున్నాడు. బ్రహ్మ సరే నన్నాడు. స్త్రీలవలన తనకు చావులేదని రాక్షసుడనుకున్నాడు. కాని "దైవఘటన మెరుగ తరమె." బ్రహ్మ వరప్రభావంతో గర్వించి వాడు లోకాలు తిరగటం మొదలు పెట్టాడు.

అసలు మహిషాసురుని పూర్వవృత్తాంతం చెప్పాలి. రంభ కరంభ అనే అన్నదమ్ములు సంతానం లేక గొప్ప తపస్సు చేశారు. కరంభుడు మొసలి వలన చచ్చిపోయాడు. రంభుడు పట్టుదలపట్టి తన కంఠము నఱికి హోమం చేయడానికై యత్నించాడు. చచ్చి సాధించగలరా! ఎందుకీ

ఘోరకర్మ! నేను వరమిస్తాను అని అగ్ని అన్నాడు. గొప్ప పరాక్రమం కలిగిన కుమారుని ప్రసాదింపమని రంభునికోరిక. అగ్ని సరేనన్నాడు. "ఏజాతి వనిత యెడల కుతూహలము పొందుతావో ఆజాతి తనయుడు కలుగుతాడు" అని అగ్ని చెప్పి వెళ్ళాడు. రంభుడు బయలుదేరి తిరుగుతూ ఉండగా ఒక అరణ్యంలో వనగజమువలె ఒక ఆడ మహిషము కన్పించింది. రంభాసురునకు ఆగేదెదూడ లావణ్యము ఆసక్తి కలుగ జేసింది. తాను కామరూపుడు కాబట్టి మహిషాకారము ధరించాడు. వారి సంతానమె మహిషాసురుడు.

ఆ మహిషాసురుడు ఇంద్రాదులను జయించి ఏకచ్ఛత్రముగా పాలించుతున్నాడు. మహిషాసురునకు ఎవ్వరూ ఎదురునిలబడలేకపోయారు. ఇంద్రుడధైర్యపడ్డాడు. బ్రహ్మాదులవద్దకెళ్ళాడు. మహిషుని మాయాయుద్ధానికి అందరూ హడలిపోయినారు. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు స్వస్థానాలకు పోయినారు. దేవతలు పారిపోయినారు. ఇక వారికేమీ గతి లేదు. మహిషుడు పురుషులచే చావడు. స్త్రీలచే చావకుండా ఉంటాడా అని ఆలోచించి బ్రహ్మాదులందరూ తమ తమ శక్తులనన్నిటినీ ఆవిర్భవింపజేశారు. వారి శక్తి తేజస్సు లన్నీ వెలువడి ఆకాశాన ఘనీభవించుతున్నయి. అదేసమయంలో భార్గవి, భారతి, చండిక, శచి మొదలయిన దేవతాస్త్రీల తేజస్సులు ఆకాశాన వ్యాపించినవి. "ఎల్ల తేజంబులు మహామేరుసంకాశంబై జ్వాలామయంబై జగద్భీషణంబై రాసీభవించగా" ఆ తేజోరాసినుండి పద్ధెనిమిది భుజాలుకల శ్వేతానన, కృష్ణనేత్ర, రక్తాధర, రక్తహస్త అయిన ఒక దివ్యసుందరి

ఆవిర్భవించింది. క్షణక్షణానికి ఆ మహాసుందరికి శతసహస్ర భుజములు ఆవిర్భవించినవి. నానావిధ ఆయుధములు ధరించింది. ఆమె "మహాశక్తి". ఆమె "మహాదేవి". ఆ దేవి విశ్వరూపముధరించి దేవతలందరకు సాక్షాత్కరించింది. దేవతలందరూ తమతమశక్తులను ఆయుధ తేజస్సులు శస్త్రాస్త్రములుగాజేసి మహాదేవి కర్పించారు. ఆభరణాలర్పించారు. ఆ దివ్యశక్తిని జూచి విస్మయమాన మానసులై సర్వదేవతలు దోసిలిబట్టి ఎదుటనిలచి త్రైలోక్యమోహినీ! శివా! కల్యాణీ! శాంతీ! పుష్టీ! భగవతీ! రుద్రాణీ! కాళరాత్రీ! అంబికా! శత్రుతాపినీ! జననీ! నీకు జోహారులొనర్చెదము. మహిషాసురుని మర్దించి మమ్ము రక్షింపుము." అని ప్రార్థించారు.

మహిషాసురుడు ఒకప్పుడు పెద్దధ్వని విన్నాడు. "ఇదేమో కనుక్కోండి. ఈ గర్జితమును చేసిన దెవరో!" వాని మాటనుబట్టి భటులువచ్చి ఈమహాదేవిని చూచారు. ఎదుట నిలువలేక పోయినారు. దేవి సింహమెక్కి పద్దెనిమిది చేతులతో మహాకారము ధరించి ఖడ్గముపట్టి కన్పించింది. ఆ సమయంలో

జయపాహి!జయపాహి!జయపాహి! హేదేవియనుచు నిర్జరకోటియభినుతింప
త్రాహిన స్త్రాహిన స్త్రాహిన యని మునుల్ సర్వతోవృతులౌచు సంచరింప
శందేహిశందేహిశందేహియని బ్రహ్మ హరిహరాదులు చుట్టుచేరసికొలువ
జహిరిపూన్ జహిరిపూన్ జహిరిపూనని సిద్ధచారణాదులుజయోత్సవంబుగొల్వ
కొలువుదీవించి యున్నదకొమ్మ నేలికొనెడి వల్లభుడెవ్వడో వనజనయన
యెవ్వతయొ? యేమి సేయునో? యేమిగోరివచ్చెనో మాకు దెలియంగవచ్చునొక్కో.

ఆమహాదేవి తేజస్సు అంతటా వ్యాపించింది. మహిషాసురుడు తనమంత్రిని దేవిదగ్గరకు పంపించాడు. మా ప్రభువు "నిన్ను మందలించుతున్నాడు. మానవరూపమును ధరించి చూడవలెనని అనుకుంటున్నాడు." ఆ మాటలు వినగానే దేవి నవ్వింది. "దేవతా ద్రోహివైనావు. పాతాళానికి పో. ప్రతియుగములోనూ నీవంటి దుష్టులను సంహరించుచున్నాను." దేవి చెప్పిన ఈమాటలను మహిషునిదూత సరిగా వినలేదు. మా ప్రభువును స్వీకరించు అనికూడా అన్నాడు. దూతగా నీవు చెప్పవలసింది చెప్పావుగాని తగినట్లు లేదు. మీ ప్రభువును వధించడానికై నే నవతరించాను.

సరసరంభా నాట్య సంరంభములు కావు చండి కారణరంగ తాండవములు
విద్యాధరీతల్ప విహరణంబులు గావు ధూమావతీ పదోద్ధూననములు
కిన్నరీకలకంఠ గీతధ్వనులు గావు చాముండికా ధనుర్ఘాంకృతములు
యక్షకన్యార దాంక క్షతంబులు గావు, కాళికా కరవాల కీలనములు.
దేవకాంతల జెరపట్టి తెచ్చినట్టి పౌరుషము గాదు మహిషవిదారణీక
రాగ్ర కేశశిఖాకర్షణాభిపాత కంటకధ్వస్త గాత్రసంఘట్టనములు.

ఆమాటలువిని దూత మహిషుని దగ్గరకు వెళ్లాడు. దేవిని వర్ణించి చెప్పాడు. మహిషుణ్ణి తిరస్కరించినట్లున్నూ చెప్పాడు. మహిషుడు మంత్రులతో మంత్రాంగం చేశాడు. తగిన సన్నాహంతో యుద్ధము చేయాలని నిశ్చయించాడు. దేవీ సంరంభము చూచి వారు చెదరిపోయినారు. మహిషుని పక్షాన బాష్కలుడు, దుర్ముఖుడు, చిక్షురుడు, తామ్రుడు, అసిలోముడు, బిడాలుడు మొదలయినవారు వచ్చి దేవితో యుద్ధం చేసి హతులయినారు. ఇక మహిషాసురుడు కొమ్ములతో గిట్టలతోనున్న తన రూపాన్ని చూచి దేవి మెచ్చదేమోనని

మానవాకారంతో కనపడితే బాగుంటుందని మాయామానుషవిగ్రహంతో వచ్చాడు. మహిషునకు దేవి ఎంతగానో ధర్మబోధ చేసింది. ఎన్నో విశేషాలు చెప్పింది. వాడు వినలేదు. తీవ్రంగా యుద్ధంచేశాడు. దేవి మహిషాసురుని సంహరించింది. అపుడు దేవతలందరూ అనేక రకాల దేవిని స్తుతించారు. మహిషాసురమర్దనము అయిన పిమ్మట "మహాదేవి" మణిద్వీపానికై వెళ్ళింది. స్త్రీదేవతలలో "మహిషాసురమర్దని" విశేషమును తెలిసికోవడము చాల యుక్తముగా ఉంటుంది. "మానవులలో నానారాక్షసప్రవృత్తు లుంటవి. వానిని తగ్గించాలంటే నానావిధములయిన బుద్ధి, శక్తులను కూడబెట్టుకోవాలి. వాని ద్వారా దుష్టవృత్తులు నశించిపోతవి. అపుడు యోగ్యమయిన విశ్రాంతిస్థానము లభింపగలదు". అనే విషయము దీనిలో బాగా లభిస్తుంది. ఈ దినాలలో ఈ మహాదేవి విలాసములను మనము తెలిసికొనడము చాల మంచిది.

పరాశక్తి అనేకవిధాలుగ లోకాన్ని రక్షించింది. శుంభనిశుంభు లనే రాక్షసులను "పరాశక్తి" సంహరించింది. శుంభుడు నిశుంభుడు అని యిద్దరన్నదమ్ము లుండేవారు. తీవ్రంగా తపస్సు చేసి చాలా వరములు సంపాదించారు. "స్త్రీలంటే మాకేమీ భయం లేదు. పురుషుల వలన చావులేకుండా వర మీయాలి" అని అడిగి వారు వరాలు సంపాదించారు. చండుడు, ముండుడు, రక్తబీజుడు, ధూమ్రలోచనుడు మొదలయిన మహారాక్షసులంతా ఆ బలంతో దిక్పతు

లను వెళ్ళ గొట్టారు. శుంభుడు సర్వజగత్ప్రభు వయినాడు. దేవతలు గెలువలేక పారిపోయినారు. తమ పరాభవమును గురువుతో చెప్పుకున్నారు. పరాశక్తిని స్తుతించారు. చండికారాధనం చేశారు. రక్షింపవలసిందని ప్రార్థించారు. దేవి, దేవత లందరకు వరాలిచ్చింది, అభయం ఇచ్చానంది. వారంతా తమ బాధ విన్నవించుకున్నారు. ఆ దేవి రూపాంతరము వహించింది. కాళరాత్రి అనే పేరుతో బయలుదేరింది. కాళిక వెంట వస్తూ ఉండగా సింహాసనం అధిష్ఠించి బయలుదేరింది. కంఠమెత్తి పాట పాడింది. ఆ గానము విని వనమంతా సంతోషించింది. శుంభుని పరివారములోని చండముండులు కాళరాత్రిని చూచి శుంభుని దగ్గరకు వెళ్ళి ఈమె సౌందర్యాన్ని వర్ణించి చెప్పారు. శుంభునకు ఆసక్తి కలిగింది. దూతను పంపించాడు. ఆ దూత పేరు సుగ్రీవుడు. తన ప్రేమ నంతా వాని ద్వారా తెలియజేశాడు. సుగ్రీవుడు దేవి దగ్గరకు వెళ్ళి విషయమంతా చెప్పాడు. అమె పరిహాసం చేసింది. నాతో యుద్ధం చేసి నన్ను గెలిచినట్లయితే అటువంటిశూరుని స్వీకరిస్తాను. నేనీవిధంగా ప్రతిజ్ఞ పట్టాను. మీ ప్రభువుతో ఈ మాటలు చెప్పు. వాడు వెళ్ళి దేవిచెప్పినదంతా చెప్పాడు. అదంతా విని శుంభుడు "ఆడదానికై యింత విచార మేటికి ? ధూమ్రలోచనా! నీవు వెళ్ళి మనసంగతి చెప్పి అవసరమయితే యుద్ధంచేసి విజయము సంపాదించు" అని పంపించాడు. అక్కడ కాళికతో అంబికాదేవి మాటలాడుతూ ఉంది. ధూమ్రలోచనుడు యుద్ధానికై వచ్చాడు. కాళికా దేవి తీవ్రంగా విజృంభించింది. ఆతడు ఆ కాళికపై విజృంభించాడు. అంతలో

మహాదేవి ధూమ్రలోచనుని సంహరించింది. కాళిక పైకి చండముండులు యుద్ధానికివచ్చారు. ఎన్నెన్నో పిచ్చిమాటలు పలికారు. మహాశక్తి చండముండులను సంహరించింది.

రక్తబీజుడు అనే రాక్షసుడు ప్రచండవేగంతో వచ్చి యుద్ధంలో తలకొన్నాడు. హతుడయినాడు. శుంభుడు ఇక చేయునది లేక సపరివారంగా తానే బయలుదేరి వచ్చాడు. సింహమెక్కి మహాదేవి వచ్చింది. మహాసంగ్రామం జరిగింది. రక్తబీజుడు అనే రాక్షసుని దేహమునుండి ఒక్కొక రక్తపు చుక్క క్రింద పడగా కొన్ని వందలమంది రాక్షసులు పుడుతుండేవారు. శత్రుసైన్యం తగ్గేటట్లు లేదు. అపుడు కాళికాదేవి తన పెద్ద నాలుకను యుద్ధభూమిపై చాచింది. రక్తబీజుని రక్తమంతా త్రాగివేసింది. ఇంక నిశుంభుడు గూడా యుద్ధానికి వచ్చాడు. శుంభనిశుంభులు యుద్ధం చేస్తున్నారు. చండికాదేవి నిశుంభుని హతమార్చింది. ఇక శుంభుడు మిగిలాడు. యుద్ధంలో ఏవేవో మాట్లాడాడు. వాడు దుర్భాషలు పలుకుతున్నాడని "వీనిని నేను తారసిలంగరాదు" అని మహాదేవి తలచి కాళిక నా యుద్ధము చేయమన్నది, శుంభుడు హతుడయినాడు. దేవతలంతా సంతోషపడ్డారు. రాక్షసులంతా మన్నింపమని దేవినిప్రార్థించి పాతాళానికి పోయినారు. చండముండాసురులను శుంభనిశుంభులను సంహరించిన స్త్రీదేవతా వృత్తాంతము ఈ విధముగా ఉన్నది. దేవీ భాగవతము ఐదవస్కంధములో మహాదేవి ప్రభావం అధికంగా ఉన్నది. భక్తులు చాల అభిమానంతో పంచమస్కంధం భావిస్తారు. మహాదేవి నివాసము చేసే మణిద్వీపమును దేవీభాగ

వతం బాగా వర్ణించింది. మణిద్వీప వర్ణనమును భావించి భక్తులు చాల సంతుష్టి పడుతుంటారు.

దక్షప్రజాపతికి చాలామంది పుత్రిక లున్నారు. వారిలో సతీదేవి పెద్దది. శివునకు భార్య అయింది. దక్షుడు తన కూతుళ్ళను చంద్రుడు మొదలయిన వారలకిచ్చాడు. అందరిలోనూ గొప్పవా డనిపించుకోవాలని దక్షుడు యజ్ఞం చేయదలచుకున్నాడు. అల్లుళ్ళనందరినీ ఆహ్వానించాడు. పెద్దల్లుడు శివునకు తగిన వైభవము హోదా లేదని ఆహ్వానించలేదు. అయినా అతని భార్య సతీదేవి తన నాయన చేసే యజ్ఞానికి తాను వెళ్ళదలుచుకుంది. "మా నాన్న యజ్ఞానికి నేను వెళ్లుతున్నాను" అని భర్తతో అంది. శివుడేమీ అనలేదు. ఆమె దక్షయజ్ఞానికై వెళ్ళింది. వాళ్ళెవరూ ఆదరించలేదు. ఆహ్వానించనూ లేదు. అభిమానించనూ లేదు. మీదు మిక్కిలి అందరూ అవమానించారు. తండ్రి దక్షునిపై సతీదేవికి కోపం వచ్చింది. ఆత్మయోగముతో దేహత్యాగము చేసింది. ఆ సతీదేవి హిమవంతునకు కూతురై పార్వతీదేవిగా జన్మించింది.

మహాకవి కాళిదాసు కుమారసంభవము నే కావ్యమును పార్వతీ చరిత్రను చెప్పడానికై వ్రాశాడు. తన కవిత్వ శక్తినంతా పార్వతీ పాదాలపై ప్రసరింప చేశాడు. పార్వతీ దివ్యసుందర దేహం కలది అయింది. హిమాలయముపై శివుడు తపస్సు చేస్తున్నాడు. హిమవంతుడు తన కూతురయిన పార్వతిని శివునకు పరిచర్య చేయవలసినదని నియమించాడు.

అపచితబలిపుష్పా వేదిసమ్మార్గదక్షా నియమవిధిజలానాం బర్హిషాంచోపనేత్రీ!
గిరిశముపచార ప్రత్యహం సా సుకేశీ నియమితపరిఖేదాతచ్ఛిరశ్చంద్రపాదైః

పూజాపుష్పాలను తెచ్చేది. వేదికలను తుడిచి ఉంచేది. పూజా జపములకు తగిన జలము తెచ్చేది. కుశలు తెచ్చి ఉంచేది. నిత్యమూ ఈ విధంగా పార్వతి శివుని పరిచర్య చేసింది. శివుని శిరోభూషణ మయిన చంద్రుని కిరణాలు ఆమె కేమీ ఆయాసం లేకుండా చేసేవి. ఇట్లా కొంతకాలము గడిచింది. అకాల వసంతసమయంలో వనమంతా పుష్పించింది పార్వతీదేవి వసంతపుష్పాభరణం ధరించి ఎఱ్ఱనివస్త్రం ధరించి శివుని దగ్గరకు వచ్చింది, శివుని పాదమూలంలో పూజాపుష్పాలర్పించింది. నమస్కరించింది. తామరపూసల పేరు శివుని కర్పించింది. శివు డా మాలను స్వీకరిస్తూ పార్వతిని మరోవిధంగా చూశాడు. "నా అంతటి వానికి ఈ వికారం ఏలకలిగింది ?" అనుకున్నాడు. దూరానఉన్న మన్మథుని ఫాలాగ్నితో దహించి, "తపస్సు చేసేటట్లయితే స్త్రీసంబంధం తగదు" అనుకొని ఆ స్థలం విడిచి శివుడు వెళ్ళిపోయినాడు. పాపం పార్వతికూడ తన అభిలాష వ్యర్థం అయిందని తన సౌందర్యం సఫలం కాలేదని సఖుల ఎదుటనే యింతపనీ జరిగిందని సిగ్గుపడి అక్కడనుండి కదలింది.

తనరూపం నిందించుకున్నది. శివానుగ్రహం పొందటానికి ఈసౌందర్యం చాలదు. తపస్సుచేయాలి. తపస్సౌందర్యం సంపాదించాలి. అని పార్వతి అనుకుంది. తల్లి ఎంతో చెప్పింది కాని పార్వతి పట్టు విడువలేదు. తండ్రి ఒప్పుకున్నాడు. గౌరీశిఖరానికై వెళ్ళింది. తపస్సు మొదలుపెట్టింది. వల్కలం ధరించింది. చలించకుండా తపస్సు చేసింది. తన శరీర మార్దవం చూచుకోకుండా తీవ్రతపస్సు మొదలు పెట్టింది. వేసవిలో వర్షాకాలంలో

హేమంతంలో నిశ్చలంగా తపస్సు చేసిన పార్వతిని మహర్షులందరూ అభినందించారు. ఒకనాడు ఒక బ్రహ్మచారి అక్కడకు వచ్చాడు.వారు అందించిన ఆతిథ్యం అందుకున్నాడు. ఏదో మొదట మంచిమాటలడిగి "నీవు తపస్సుచేయడం బాగానే ఉంది. కొన్నిమాటలు అడగాలనుకొన్నాను. నీవు గొప్ప వంశంలోజన్మించావు. నీకేమీలోటు లేదే? ఈతపస్సు ఎందుకు చేస్తున్నా వమ్మాయ్? ఈ వయస్సులో నీవు భర్తతో ఉండవలసిందిగదా! ఈ విధంగా తపఃశ్రమ సహిస్తున్నావే! నాకు జాలివేస్తోంది. నీవు మనస్సులో ఏదో పెట్టుకున్నావు. నా తపస్సులో భాగం యిచ్చేదా?" అంటూ ఉత్త సోది మొదలు పెట్టాడు. పార్వతి విని ఈతడు మంచివాడే అనుకుంది. పార్వతి చెలికత్తె పార్వతివిషయమంతా చెప్పింది. శివునిపై పార్వతికి గల ప్రేమనంతా వర్ణించింది. "నిజమేనా?" అన్నాడు ఆ బ్రహ్మచారి. ఔనన్నది పార్వతి. ఇక ఆ బ్రహ్మచారి మళ్ళీ మొదలుపెట్టాడు. "శివుణ్ణి ప్రేమిస్తున్నావా? నీ కిటువంటి కోరిక పుట్టిందేమి? శివుడు సుందరుడా? ధనవంతుడా? గొప్పవాడా? నీకు తగినవాడు కాడుగదా! ముసలి ఎద్దును ఎక్కుతాడు. శ్మశానంలో నివసిస్తాడు. బూడిద పూసుకుంటాడు. ఇది నీకేమీ యుక్తంగా లేదు" అని బ్రహ్మచారన్నాడు. పార్వతికి కోపంవచ్చింది. "నీకా శివుడంటే తెలియదు. అందువలన ఈవిధంగా పలికావు. శివుడు త్రిలోకనాథుడు. శివతత్వం ఎవరికి తెలుస్తుంది? ఆతడు విశ్వమూర్తి. సఖీ! ఈయ నేదో పలుకవలెననుకుంటున్నాడు.అవతలకుసాగనంపు"అని చెప్పింది. ఇంతలో బ్రహ్మచారి లేచాడు. శివుడుగా మారిపోయాడు.

పార్వతి శివునికై తపస్సు చేస్తోంది. సాక్షాత్తు ఆ శివుడే వచ్చి ఆమెచేయి పట్టుకున్నాడు. ఏమిచేయాలి? ఏమీతోచలేదు.

"శైలాధిరాజ తనయా న యయౌ న తస్థౌ"

పార్వతి అక్కడనుంచి కదలలేదు. నిలవనూలేదు. "మా నాయన ఉన్నాడు. ఈ విషయం వారినే అడగండి" అని చెప్పించింది. శివుడు ఋషులను హిమవంతుని దగ్గరకై పంపించాడు. పార్వతిని తనకిచ్చి వివాహం చేయవలసిందని తన కోరికను అడిగించాడు. హిమవంతునకు సంతోషం కల్గింది. వివాహం నిశ్చయించాడు. పార్వతీ దేవి వివాహాలంకారంతో సాక్షాత్కరించింది. పార్వతీ పరమేశ్వరులకు వివాహమయింది.

స్త్రీ దేవత ఏవిధంగా ఉండవలెనో పార్వతిని చూచి నేర్చుకోవాలి. పార్వతీదేవి దివ్యవనిత అయినప్పటికి ఉదాత్త మానవ స్త్రీ ఏవిధంగా ఉండవలెనో రమ్యంగా కాళిదాసు నిరూపించాడు. పతి అనుగ్రహం సంపాదించడానికి దేహ సౌందర్యం తగదని ఆత్మ సౌందర్యం కావాలని కాళిదాసే చెప్పాడు కాబట్టి ఎవరూ ఏమీ అనకూడదు. సంప్రదాయ నియమంలో ఉండి తల్లిదండ్రుల గౌరవమును తన నారీగౌరవ మును రక్షించే ఏస్త్రీ అయినా దేవత అనేఅనాలి.

ఉపనిషత్తులలో ఒక కథ ఉన్నదట. వాచక్నవి అనే గార్గి వేదాంతచర్చలు చేసేది. ఆమె పెళ్ళి చేసుకోలేదు. బ్రహ్మచారిణి. ఒకప్పుడు స్త్రీలు బ్రహ్మవాదినులై వివాహము లేకుండా ఉండేవారు కాబోలు. జనకమహారాజు ఒకప్పుడు మహాపండితసభ చేశాడు. చాలా గోవుల మెడలలో బంగారు నాణెములు కట్టి ఉంచాడు. పండితసభ చూచి మీలో బ్రహ్మ

వేత్త ఎవరో వారు ఈ గోవులను స్వీకరించండి! అన్నాడు. యాజ్ఞవల్క్యుడు ముందుకువచ్చి గోవులను అందుకున్నాడు. అపు డందరు ప్రశ్నలు అడిగారు. స్త్రీలలోనుండి గార్గి లేచి ఆమహర్షిని ప్రశ్నలడిగింది. ఒక బ్రహ్మవేత్త ఎదట ప్రశ్నలు అడిగిందంటే ఆమె యోగవిద్య గొప్పదై ఉండాలి. యోగిని అయిన స్త్రీని మనము దేవతగానే చూడాలి.

ఇంకా, శతరూప, లోపాముద్ర, సుకన్య మొదలయిన స్త్రీ దేవత లెందరో ఉన్నారు. ఒక్కొక్కరిలో ఒక్కొక్క విశేషం ఉంది. వానిని మనం మనకు తగినట్లుగా స్వీకరించితే బాగుండును.

ఒకనికి ఒక గతిలేనిపిల్ల దొరికింది. పెంచి పెద్దచేశాడు. ఏదో పనిమీద ఎక్కడకో వెళ్ళాడు. ఇంతలో ఒకరాజు వస్తే ఆ అమ్మాయి అతని భర్తగా స్వీకరించింది. ఆ పెంపుడుతండ్రి ఎంత బాధపడ్డాడో! ఇటువంటి స్త్రీని మనసమాజం ఎట్లా భావిస్తుంది. ఆమె శకుంతల. మేనక కూతురు. కణ్వమహర్షి పెంచాడు. ఇదంతా తెలుసుగా!

ఒక అమ్మాయి తన యిష్టుణ్ణి తన భవనంలోనే ఉంచి సంతానం కన్నది. తండ్రికి తెలిసింది. తుదకు తండ్రిని చంపమని భర్తకు ఖడ్గం ఇచ్చింది. ఇది ప్రభావతీ ప్రద్యుమ్నంలో కథ. ఇటువంటి స్త్రీలను మనం ఎట్లాచూస్తాము?

మన తెలుగు కావ్యాలలో ఇటువంటి కథలు చాలా ఉన్నవి. మనం జాగ్రత్తగా చదవాలి. వాళ్ళకు ఇవ్వవలసిన గౌరవం వాళ్ళకు ఇవ్వవచ్చు. అయితే వారి చేష్టలన్నీ మనకు నిత్యజీవితంలో వస్తే స్త్రీదేవతలన్న పేరు పోతుంది. ధర్మ

శాస్త్రాలు స్త్రీలను దూషించినట్లు కన్పడుతుంది. ఆకర్షకమయిన వేషాలు ధరించి అమర్యాదగా ఉంటే ఎవరయినా ఏమయినా అంటారు. ధర్మశాస్త్రాలయినా మంచితల్లిని, మంచికూతుర్ని, మంచికోడల్ని, మంచిఅత్తను, మంచిముత్తయిదువను ఏమీ అనలేదు. మనం అంతా మంచివాళ్ళం కాబట్టి ధర్మశాస్త్రాలు మనల్ని ఏమీ అనవు. మనల్ని ఏమీ అనని ధర్మశాస్త్రాలు మారడం ఎవరూ కోరరు. ఇక కొన్ని మాటలతో ముగిస్తాను.

౧. స్త్రీ తాను కేవలం భార్య అనే దృష్టితో కాక గృహిణి, తల్లి, కోడలు, కూతురు. అత్త అనే భావంతో కూడా ప్రవర్తించడం నేర్చుకోవాలి.

౨. విలాసజీవనం కాక పరిశ్రమ పనిపాటలు జీవితం అలవాటు పడాలి. పొదుపుగా సంసారనిర్వహణం సర్దుకోవాలి.

3. సంతాన పోషణము పెద్దలసేవ హీనములని మనం అనుకోరాదు. దయ, భక్తి కూడా ముఖ్యములని అనుకోవాలి.

౪. సినిమాలు, నాటకాలు, నవలలు, పత్రికలు, పిచ్చి కథలు విడిచి ఆరోగ్యంగా ఉండడం మంచిది.

౫. ధర్మము, దానము, జపము, పూజ, వ్రతములపై బాగా ఆసక్తి కలుగజేసికోవాలి.

౬. సదాచారముకల విశ్వస్తలయిన స్త్రీలను యతీశ్వరుల మాదిరి అదరించాలి.

౭. అటూ యిటూ చెదిరిపోయిన మనస్సుకల స్త్రీలకు అభిప్రాయం మార్చి తగిన ప్రాయశ్చిత్తముతో అభిమానించాలి.

౮. స్త్రీలు ఒకరినొకరు దేవతగా భావించడం నేర్చుకోవాలి.

ఇటువంటి పద్ధతులు మన అలవాట్లలోకి వస్తే మనం అవశ్యంగా దేవతలమే. స్త్రీ దేవతలందరకూ నమస్కారము.

## ౧౩. స్త్రీశక్తి నిరూపణము

శ్రీ శరన్నవరాత్రాలలో దేవీభావనము చేసేవారందరూ నారీశక్తి గౌరవమును భావించుతునే ఉన్నారు. "నేను స్త్రీని. నా స్వామికి నేను సహధర్మచారిణిని. నా సంతానమునకు నేను తల్లిని. నావంటి వారెవరున్నారు? ఈ జగత్తంతా నా సంచారభూమి. నేను నా అధీనంలో ఉన్నాను. నా ఇచ్ఛానుసారంగా ఉంటాను. నాకేమీ భయంలేదు. నేను మహాశక్తిని. నా శక్తిని పొంది మానవుడు శక్తిగలవాడవుతాడు. నేను నియమంగా ఉంటాను. సర్వశక్తులు నాలో ఉంటవి. దురాచారంలో ఉంటే నా శక్తులేవీ ప్రకాశించవు. నేనే పనీ చేయకపోతే సంసారమంతా స్తంభించిపోతుంది. నా తత్వం లోకం సరిగా గుర్తించడంలేదు. నాకంటె ఇతరమేమీ లేదు. నేను చదువుతాను. నా సంతానానికి ప్రబోధమిస్తాను. నా స్వామికి శాంతి కూర్చుతాను. హృదయమును కోమలంగా చేయడానికి నేను గానంచేస్తాను. నియమవిధానములన్నీ నా ఆధీనంలోనే ఉంటవి. నేను ఆయుధాలు ధరించే దుర్గాదేవిని. ధర్మదూరులను హతమార్చుతాను. నారీశక్తి వికసింపచేయడానికి నేనెంతైనా చేస్తాను. నేను లక్ష్మీదేవిని. ప్రపంచమంతా శోభింపచేస్తాను. నేను సరస్వతిని. ప్రపంచా

నికి విద్యాదానం చేస్తాను. నేను భూదేవతను. సర్వము సహించ గలను. నా ధర్మములో ఇతరములు కలియవు. నాలో నారీత్వ మున్నది. మాతృత్వమున్నది. స్త్రీలందరూ నాజాతివారే. పురుషుడు కాముకుడై స్త్రీని కామిని అన్నాడు. అబల అన్నాడు. రామాయణము మహాభారతము నాకు జ్ఞానమిచ్చె గ్రంథాలు" అని బాగా భావించినపుడు స్త్రీని పురంధ్రిఅన్నారు.

స్త్రీ స్వభావములో ఒక గౌరవమున్నది. సృష్టిలో సౌందర్యమును సంపాదించినది స్త్రీ స్వభావమె. మానవ జాతిలో స్త్రీ దృష్టి సుందరమని తన తల్లినిజూచిన ప్రతికుమా రుడూ భావిస్తూనే ఉంటాడు. స్త్రీ బాగా విశ్వసించగలదు. శ్రద్ధాసక్తులు ప్రేమలాలనలు దయాశాంతులు మొదలయిన సుకుమార భావములు స్త్రీప్రాణి సులభములు. ఇటువంటి భావములె లోకతంత్రమును నిర్వహించుతూ ఉంటవి. భక్తి ప్రేమ, లాలన మానవులలోనుండీ నశించితే జగత్తంతా ఒకసారి మారణహోమం అయిపోతుంది. అందువలననె మహాదేవి స్త్రీ రూపంగా భాసించింది. కేనోపనిషత్తులో ఒక కథ ఉంది. దేవతలు రాక్షసులు పోట్లాడుకున్నారు. దేవతలు విజయం పొందారు. ఆ విజయం అంతా తమదే అనుకున్నారు తమ పట్టణంలో విజయోత్సవాలు చేసుకుంటున్నారు. ఇంతలో ఒక మహాభూతము పట్టణము దగ్గరకు వచ్చింది. అందరకూ గాభరా కలిగింది. ఇదేమిటిదేమిటని అందరూ ప్రశ్నిస్తారు. ఏమిటో ఏమిటో అనుకుంటారు. ఆ భూతం ఏమిటో తెలుసు కోవాలి అని ఇంద్రుడాలోచించి వాయువు నక్కడకు పంపిం చాడు. వాయువు భూతం దగ్గరకు వెళ్ళింది. తన ప్రభావము

నంతా చెప్పుకుంది. లోకాన్నంతా గజగజలాడించి ఊగించు తానని వాయువన్నది. "ఏదీ ఈ గరిక పరకను కదిలించు" అని భూతమన్నది. వాయువు ఎంత ప్రయత్నము చేసినా గరిక పరక కదలలేదు. సిగ్గుపడి వాయువు వెళ్ళిపోయినాడు. ఇంద్రుడు అగ్నిని పంపించాడు. అగ్నికూడా వచ్చి తన పరాక్రమం చెప్పుకున్నాడు. తన మహోజ్వాలలతో ప్రపంచాన్నంతటినీ ఒక్క క్షణంలో అస్వాదం చేస్తాను అని అగ్ని అన్నాడు. కాని గరిక పరికను ఏమీ చేయలేక సిగ్గుపడి వెళ్ళి పోయినాడు. ఇక లాభంలేదని యింద్రుడు తానంతట తానే వచ్చాడు. వచ్చి చూచేటప్పటికి భూతం అంతర్హితమై పోయింది. ఇంద్రుడు సిగ్గుపడ్డాడు. ఈ తత్వమేమిటో తెలుసుకుంటేనేగాని నేనిక్కడ నుండి కదలను అని తపస్సు చేశాడు. "ఉమా హైమవతీ బహుశోభమానా" ఆకాశాన దేవి గోచరించింది. పరాశక్తి స్త్రీరూపంగా అవతరించి సాక్షాత్కరించింది. వేదసారమైన గాయత్రి స్త్రీరూపంగా ఉన్నట్లు అందరకూ తెలుసు. అందు వలననే స్త్రీసృష్టి చాలా సాభిప్రాయమని పెద్దలంటున్నారు.

భార్యగా స్త్రీ శక్తి గౌరవమును సంస్కృత కవులు చక్కగా నిరూపించారు. సీతాదేవి శీలసౌందర్యం అందరికీ ఉండాలి. రావణాసురుడు సీతను ఎన్నోవిధాల ప్రార్థించాడు. సీత అవహేళనచేసి పలికింది.

"చరణేనాపి సవ్యేన న సస్పృశేయం నిశాచరం
రావణం కింపున రహంకామ యేయం విగర్హితం"

ఎడమ కాలితో కూడా ఈ రావణ రాక్షసుణ్ణి స్పృశింపను. ఈతడు నీచుడు అంటుంది. "నా హృదయంపై నాకు విశ్వాస

మున్నది. నన్ను నావశంలోనే ఉంచుకున్నాను. నేను శ్రీరామునితప్ప యెవరినీచింతించను. రావణుడునన్ను తాకినాడా నా అపరాధములేదు". అని అనే సీతయొక్క ఆత్మబలం ఎంత గొప్పదో స్త్రీజాతికంతకూ గౌరవంగా భావించతగినది. రాముడు తనను సరిగా విశ్వసించ లేదని అనుమానించిన సీత నారీశక్తిగా యెంతో మంచి మాటలు విన్పించింది.

త్వయాతు నరశార్దూల క్రోధమేవానువర్తతా
లఘునేవ మనుష్యేణ స్త్రీత్వమేవ పురస్కృతం ॥
నప్రమాణీకృతః పాణిర్బాల్యే బాలేనపీడితః
మమభక్తిశ్చ శీలంచసర్వంతే పృష్ఠతఃకృతం ॥

మీకు కోపంవచ్చింది. పామర మానవునివలె ఆడతనము అవలంబించిచూస్తున్నారు. మీరు పాణిగ్రహణం చేశారే! అది ప్రమాణంగా భావించడంలేదా! నా భక్తి నా శీలము మీరు గుర్తించనే లేదా! వీనినన్నిటిని వెనుకకు నెట్టివేశారా! అని అంటుంది సీతాదేవి. స్త్రీల గృహజీవనం భగవంతుని ప్రాప్తికి సోపానంగా ఉంటుంది.

ప్రాచీనకాలంలో స్త్రీలుకూడా ఉపనయనం చేసుకొనే వారుట. వేదాలు అధ్యయనం చేసేవారుట. ఈనాటి స్త్రీ లావిధంగా ఉండగలరా?

నారీశక్తి బాగా గుర్తించడానికి దేవీభాగవతమె చదవాలి. దేవీభాగవతంలో మొదటినుంచి చివరిదాకా బాగా చూస్తే స్త్రీప్రభావమె కన్పరుస్తుంది. శ్రీవిష్ణువు శక్తిమహిమ బాగా వివరించి చెప్పాడు. ఆ శక్తి ప్రభావము వలననె తాను మధుకైటభులను నాశనము చేశాడు.

జగముల్సృజింప రాజసీశక్తియగుచు జగములుభరింప సాత్వికీశక్తియగుచు
జగము లణగింప దామసీశక్తి యగుచు నిన్ను నన్నును హరుని దానిల్పె నంబ
రాజసీశక్తిచే స్రష్టవైతివి నీవు సాత్వికీశక్తిచే సాక నేను
దామసీశక్తిచే దండింప రుద్రుండు కర్తలమైతి మిక్కరణి మనము
తత్కుటుంబము స్వతంత్రతలేదుమనయొద్ద యచ్ఛక్తి లక్ష్మి నా మహితయయ్యె
స్వాధీనపత్నియై సతతంబు నాతోడ విహరించు దదధీనవృత్తి భాండ
గర్భదాసుని బోలి యక్కలికి యెడల దృష్టిచే దుష్టినొందుచు దుష్టిగాని
యెడల దీనుండనైయుందు నీవునిటులె రాజసిని, దామసినిశూలి ప్రవిమలాత్మ!
పరతంత్రులమై యుందుము నిరతము మా ముప్పురకును నీవెరుగవె నే
పర తంత్రుడనై లక్ష్మి పరిచర్యలొనర్తు దాసపద్ధతి వత్సా!

విష్ణువుకూడా యోగమాయా మోహితుడైనాడు. ఆతని శిరము ఎగిరిపోయి సముద్రములో పడినది. దేవతలంతా స్తోత్రముచేశారు. లలితా దేవి అనుగ్రహించింది. హయగ్రీవావతారం వచ్చింది. మధుకైటభులు పాలసముద్రములో తపస్సు చేసి ఉద్ధృతంగా తిరుగుతున్నారు. వారిని సంహరించాలి. విష్ణువేమో యోగనిద్రలో ఉన్నాడు. యోగనిద్ర తగ్గాలి. ఆ యోగ నిద్రా దేవికి స్తోత్రం చేస్తూ బ్రహ్మాది దేవతలు స్తుతించారు. ఆ స్తుతి పద్యాలను దేవీభాగవతంలో చూచి నిత్యము మనము పారాయణము చేయవచ్చు.

నిరతోత్సాహముచే చరాచరము నిర్నిద్ర ప్రభావాఢ్యమై
కరమొప్పన్ విరచించినావనుచు నేగంటిన్ గదా కానిదే
ని రమా నాథుడు నిద్రచే వివశుడై నీయాజ్ఞకున్ జిక్కె నే
హరినిన్ నిద్దుర మేలుకొల్పు జగదంబా! శ్రీజగజ్జీవనీ!

కరపాదోగ్ర భయంకరాకృతిని ఖడ్గంబూని లెమ్మింక గ
ర్భర యుగ్మచ్ఛిదయో? మదీయభిదయో? రోషించు గావించు మం
తర మేమున్నది సర్వమున్ సమమె యైనన్ జెంత నే చేరితిన్
హరికిన్ నిద్దుర మేలుకొల్పు జగదంబా! శ్రీ జగజ్జీవనీ!

విష్ణువు యోగమాయా ప్రభావం తెలుసుకున్నాడు. మాయా దేవి మధుకైటభులను వంచన చేసింది. ప్రథమస్కంధంలో ఈ విషయమె చాల ముఖ్యంగా ఉంది.

ఇక రెండవస్కంధంలోని కథ అవాంతరంగా వచ్చిన కథ. తృతీయస్కంధంలో దేవీప్రభావం మళ్ళీ కనబడుతోంది. బ్రహ్మాది దేవతలు విమానమెక్కి తిరుగుతూ చాలా విచిత్ర మయిన సృష్టి చూచారు. దేవీసభను సందర్శించారు. దేవీ తత్వమును తెలుసుకున్నారు. వారందరూ శాంకరీ స్తోత్రం చేశారు. దేవి తన తత్వమును తెలియ చెప్పింది.

పురుషుండను గాను నపుంసకుండను గాను గాంతను గాను సర్గంబువలయు
తతి భేదమున నొప్పి తల్లయంబున నొక్కడై యుందుబుద్ధిలోనరయుమిటుల
స్మృతికీర్తి ధృతిబుద్ధిమతి మేధ శ్రీ శ్రద్ధదయ లజ్జ క్షుధ శాంతి దమముక్షమము
శాంతి నిద్ర పిపాస జర విద్య వాంఛయు శక్తియశక్తి యక్షమము సిరియు
త్వక్షు వసమజ్జరుధిర ముతరసకలలముఖ్యములు శబ్ద దృక్స్పర్శ ముఖరములును
స్వర సంశ్రయనాడులు సంసృతి ప్రవాహమున నేనుగాని దెప్పటికిలేదు.

స్తోత్రాలు చేసిన తరువాత బ్రహ్మాదులు శక్తులను సంపాదించారు. దేవీధ్యానం చేసి ధన్యులయిన వారి కథలు కొన్ని తృతీయస్కంధంలో ఉన్నవి. రాముడు, కృష్ణుడు దేవీధ్యానం వలననె యిష్టసిద్ధులు పొందినారని చతుర్థస్కంధంలో ఉన్నది.

దేవీభాగవతములో పంచమస్కంధము చాల ప్రధానంగా కనపడుతుంది. మహిషాసుర సంహారం, శుంభనిశుంభుల సంహారం ఈ స్కంధంలోనే ఉన్నవి. దేవీభక్తులందరూ పంచమస్కంధం బాగా చదువుతారు. పంచమస్కంధంలో గోచరించే దేవీశక్తి భువనేశ్వరీశక్తి అని పెద్దలు చెపుతున్నారు. దీనిలోనూ మంచి స్తోత్రాలు ఉన్నవి. దండకములూ ఉన్నవి.

స్తోత్రం చేసినవారందరికీ దేవి వరాలిచ్చింది. మనకున్నూ వరాలిస్తుంది.

ఆరవస్కంధలో నారదుడు స్త్రీరూపం ధరించడం కథ ఉంది. ఏడు, ఎనిమిది స్కంధములలో కొంతగా జగదంబ చరిత్రమున్నది. ద్వీపవర్ణనములు లోకవర్ణనములు కొన్ని కథలు ఉన్నవి. నవమస్కంధములో ఇంకా చాలా విశేష మున్నది. నారీశక్తుల వర్ణనము బాగా ఉంది. రాధాదేవి, గంగాదేవి మొదలయినవారి కథలు దీనిలోఉన్నవి. పూజా విశేషములు ఇంకా కొన్ని కథలు దీనిలో కనపడుతున్నయి. పదకొండు, పన్నెండు స్కంధాలలో గాయత్రీప్రభావం బాగా కనపడుతున్నది. కాగా దేవీభాగవతమంతా గాయత్రీమంత్ర మునే చెపుతూ ఉంది అంటున్నారు. గాయత్రీసహస్రనామాలు పెద్దవచనంలో శ్రీ పాపయారాధ్యులవారు వ్రాశారు. మనము స్త్రీలము. గాయత్రీ మంత్రమును జపించటానికి వీలులేదా? ఏ మంత్రమయినా గాయత్రీ వ్యాఖ్యానమె. అందువలన ఏదేని ఒక దేవీమంత్రమును మన అర్హతానుసారంగా ఉపదేశముగా పొంది జపంచేయడం చాలా బాగుంటుంది. నారీశక్తి ఎటు వంటిదో తెలుసుకొనడము సామాన్యకార్యం కాదు. కాని నారీరూపముగా నున్న శ్రీ దుర్గాదేవిని ఆరాధించడము మనందరకు తగినపని. నేను యీమాటలు చెప్పటానికి నాకు అవకాశం కలుగజేసిన మీ పెద్దలందరికీ నమస్కారం చేస్తున్నాను.

## ౧౪. శ్రీ గాయత్రి

ప్రాచీనకాలంలో చాలామంది ఆడవాళ్ళు గురువుల దగ్గర వేదాధ్యయనం చేశారని నియమంగా గాయత్రీ మంత్రమును ఉపాసించేవారని అనిపిస్తుంది. గాయత్రీ మంత్రమును ఉపాసించి స్త్రీలు చాలా సిద్ధులు సంపాదించారు. గార్గి, మైత్రేయి, మదాలస, అరుంధతి, దేవయాని, అహల్య, తార, ద్రౌపది, అపాల, సులభ, సావిత్రి, లోపాముద్ర, శకుంతల, శర్మిష్ఠ, శచి, పార్వతి, సుకన్య ఇంకా ఇంకా చాలామంది స్త్రీలు గాయత్రీ మంత్రమును జపించేవారట. ఈ కాలంలో కూడా చాలామంది స్త్రీలు గాయత్రీసాధనం చేస్తున్నారని వింటున్నాము. అటువంటివారు చాలా ప్రభావములను ప్రదర్శించేవారట. గాయత్రి వేదమాత. ఉదయము గాయత్రి అని మధ్యాహ్న సమయంలో సావిత్రి అని సాయం సమయంలో సరస్వతిఅని అంటారు. ఈ గాయత్రి స్త్రీరూపమేకదా. స్త్రీలు గాయత్రీమాతను ఉపాసించితే బాగుండును. అరణ్యాలలో కులపతుల దగ్గర స్త్రీలు కూడా చదువుకునేవారు. వారిలో కొంతమంది బ్రహ్మచారిణి, బ్రహ్మవాదినిగాఉంటూ జీవితాంతందాకా మంత్రజపంచేస్తూ యోగాభ్యాసం చేసేవారు. మరి కొంతమంది వివాహమయ్యే పర్యంతం బాగా చదువుకొనేవారు. ఉత్తమ గృహిణిగా ఉండడానికి అవసరములయిన విశేషాలనన్నిటిని జాగ్రత్తగా గుర్తించేవారు. అనుసరించేవారు. ఇటువంటి స్త్రీలకు "సద్యోవధూ" అని పేరట. ఈ రెండురకాల ఆడవాళ్ళూ వేదాలు నేర్చుకొని గాయత్రీ జపం చేసేవారని

మనం అనుకోవాలి. ఉపనిషత్తులలో యాజ్ఞవల్క్యుని భార్య మైత్రేయి బ్రహ్మవాదిని అని ప్రసిద్ధి. బ్రహ్మవాదిని అంటే బ్రహ్మవాదనశీల. వేదాలను పలుకగల సామర్థ్యం కలది అని అర్థం అన్నారు. స్త్రీలకు గాయత్రి ఉపాసనం ఉన్నదని సూచించే మాటలు సంస్కృత భారతంలో శల్యపర్వంలో శాంతిపర్వంలో కనబడుతూనే ఉన్నాయి. బాగా వేదాధ్యయనం చేసిన స్త్రీకి "వేదవతి" అనిపేరు. బ్రహ్మవైవర్త పురాణంలో ఈ మాట ఉన్నది.

"సతతం మూర్తిమంతశ్చ వేదాః చత్వార ఏవచ
సంతి యస్యాశ్చ జిహ్వాగ్రే సాచ వేదవతీ స్మృతా"

కొందరాడవాళ్ళు నైష్ఠిక బ్రహ్మచారిణిలుగా ఉండే వారని విన్నాను. యజ్ఞం చేసేటప్పుడు యజమానపత్ని కొన్ని వేద వాక్యాలను పలకాలి. వేదము పలికేటప్పుడు స్వర వర్ణ లోపము రాకూడదుకదా! అప్పటికప్పుడే పలికించితే వర్ణాలు బాగా పలుకగలిగినా సరిగా వేదస్వరం కుదురుతుందని ఎవరూ అనలేరు. స్వరాపరాధం చాలా ప్రమాదం కలగచేస్తుందని ప్రసిద్ధమే. అందువలన యజమానపత్ని వేదాధ్యయనం చేసినదై ఉండాలి అనిపిస్తుంది. గాయత్రీ మంత్రమును జపించేది అయి ఉండాలి. ఆడవాళ్ళకూ్కడా ఉపనయనం చేసేవారు. యజ్ఞోపవీతమూ వేసేవారు. కుమారసంభవంలో కాళిదాసు పార్వతీదేవిని వర్ణించుతూ అధ్యయనం చేస్తున్నట్టు అగ్నిపూజ చేస్తున్నట్టు యజ్ఞసూత్రం ధరించి ఉన్నట్టు వర్ణించాడు.

విద్యారణ్యులవారు రచించారని ప్రసిద్ధమయిన శంకర విజయ గ్రంథంలో ఉభయభారతి అనే స్త్రీ శంకరాచార్యుల

వారితో శాస్త్రార్థం చేసింది. అని ఉన్నది. ఆమె సర్వ శాస్త్రాలూ చదివిందట. షడంగ వేదములనూ అధ్యయనం చేసిందట. కావ్యనాటకాలూ తెలుసుకొందట. ఇంకా ఇంకా చాలా చదివిందట. ఆమెకు తెలియనిది ఏదీ లేదని అందరూ అనుకునేవారు. ఈ శ్లోకం వినండి.

"సర్వాణి శాస్త్రాణి షడంగ వేదాన్ కావ్యాదికాన్ వేత్తిపరంచసర్వమ్
తన్నాస్తి నోవేత్తి యదత్ర బాలా తస్మాద భూచ్చిత్రపదం జనానామ్"

స్త్రీలకు వేదాధ్యయనాధికారం ఉండేదని చాలామంది వ్యాకరణ వేత్తలు కూడా అన్నారు. ఇంతగా ఉన్న వేదమంత్రాధికారమును స్త్రీలు పోగొట్టుకున్నారు. మళ్ళీ చక్కగా అధికారం సంపాదించి స్త్రీలు కూడా వేదాధ్యయనములో గాయత్రీ జపధ్యానములలో ఆసక్తి కలవారైతే బాగుండును. స్త్రీలకు వేదమంత్ర జపాధికారం లేదని నిషేధవచనాలు లేకపోలేదు. పండితులయినవారు ఈ విషయాలాలోచించి అర్హత కలిగిన స్త్రీలకు అధికారమున్నదని అనగలరని అనుకుంటాను. ఈనాటికిన్నీ సంప్రదాయంలో ఉన్న స్త్రీలు ఉపనయనం లేకపోయినా వేదాధ్యయనం లేకపోయినా గాయత్రీ మంత్రానుష్ఠానము లేకపోయినా తమ అర్హతకు తగిన మంత్రాలను ఉపదేశంగా స్వీకరించి జపం చేస్తున్నారు. పూజలూ చేస్తున్నారు. పారాయణమూ చేస్తున్నారు. శరన్నవరాత్రాలలో దేవీ పూజలు చేసేవారు మధ్యలో సువాసినీపూజ చేస్తారు. తమ సంప్రదాయంలో మంత్రదీక్ష స్వీకరించిన ముత్తయిదువులను ముచ్చటగా పీఠంమీద కూర్చోపెట్టి పూజలు చేస్తారు. పూజలందుకున్న ఆసువాసినీ దేవత కూడా కొన్ని మంత్రాలు పలికి

కొన్ని అనుగ్రహవచనాలు చెప్పుతుంది. ఈవిధంగా మంత్రాధికారం కలిగిన స్త్రీలకు సంఘంలో మంచి గౌరవం ఉన్నది. ఇటువంటివారు తాంత్రిక మంత్రాలు స్వీకరిస్తున్నారని పౌరాణిక మంత్రాలు జపిస్తున్నారని అందరకూ తెలుసు. ఈవిధంగా అధికారం కలిగిన స్త్రీలు వేదమంత్రాలనుకూడ స్వీకరించగలిగిన వారయితే స్త్రీగౌరవం బాగా ఉంటుందని నాకు నమ్మకం. దీనికై గాయత్రీ మంత్రజపం చేయడం చాలా ముఖ్యం. పెద్దలు భారతస్త్రీల సౌభాగ్యానికి ఈ విషయం పరిశీలించడం మంచిది.

" ముక్తా విద్రుమ హేమ నీల ధవళచ్ఛాయైః ముఖై స్త్రీక్షణైః
యుక్తా మిందు నిబద్ధ రత్న మకుటాం తత్వార్థ వర్ణాత్మికాం
గాయత్రీం వరదాభయాంకుశ కశాః శుభ్రం కపాలం గదాం
శంఖం చక్ర మథారవిందయుగళం హస్తై ర్వహంతీం భజే. "

శ్రీ లక్ష్మీ ప్రెస్, గుంటూరు - 2.

# భావయిత్రీ భావనము

మా అమ్మ చతుర్దశికి కుంకుమ శోభగా ఉంటుందని మా ఆశ. అమ్మ ఉండగా అమ్మను గుర్తించినవాళ్లు ఎందరో ఉన్నప్పటికీ ఆడవాళ్ళెందరున్నారో తెలుసుకోవాలని మా కనిపించింది. అమ్మ వండితే వడ్డించితే ఆరగించిన వాళ్ళున్నారు. కొందరు ముగ్గులు నేర్చుకొన్నారు. కొందరు జడ లల్లుకున్నారు. పువ్వులు ముడుచుకున్నారు. కొందరు పాడించుకొని పాటలు విన్నారు. ఎప్పుడూ చదివించుకొని పద్యాలూ విన్నారు. ఉబుసుపోకకు పుక్కిటి పురాణాలూ విన్నారు. అసలు పురాణాలూ విన్నారు. అమ్మ కుంకుమ ధరించి జపం చేసికొంటూ ఉంటే లలితా పారాయణం చేస్తూ ఉంటే "అదిగో కామాక్షి, అదిగో హైమవతి" అని అనుకున్న ముత్తయిదువలూ చాలామంది ఉన్నారు. వారికి తెలిసింది వీరికీ వీరికి తెలిసింది వారికీ తెలీదు. వారికీ వీరికీ తెలియని చాలా విశేషాలు మా లక్ష్మీకాంతం తాతయ్యకు తెలుసు. ఎవరికీ తెలియనివి మా నాన్నకు ఎన్నో తెలుసునని అప్పుడప్పుడూ మమ్మల్ని ఊరడించడానికి చెబుతూ ఉంటే మాకు కొంత కొంత తెలుస్తున్నది. దాదాపు అమ్మవయస్సు కలిగిన ఆడవాళ్ళల్లో సాహితీ పతాకను పట్టిన స్త్రీలల్లో ఎందరెందరు కొంతగానయినా అమ్మను తెలుసుకున్న వాళ్ళు ఉన్నారో తెలిసికోవాలనుకుని కొంత తెలిసికొని కొందరికయినా ఉత్తరాలు వ్రాయవలసిందని మానాన్న నడిగాము. ఆయన ఎందరికి ఉత్తరాలు వ్రాశాడో మాకు బాగా తెలియదు కాని కుంకుమశోభిత శ్రీలక్ష్మీకాంతమ్మ గారికి వ్రాసినట్లు తెలియక "నాన్నా! అమ్మను లక్ష్మీకాంతమ్మ బాగా ఎరుగునా! ఉత్తరం వ్రాద్దూ" అన్నాము. ఆయన నవ్వాడో లేదో తెలియలేదు. ఆదరంగా చతుర్దశి అందుకోగానే లక్ష్మీకాంతమ్మగారు మా ఇంటికివచ్చి మా యోగక్షేమాలు కనుక్కొని "ఇదిగో! పంపిస్తున్నాను" అని తన భావమును భావించి భావించి పంపించారు. మా అమ్మ పిల్లలమయిన మాకు సంకల్పబలం కూడా ఉన్నది అనిపించింది. ఇది చతుర్దశి - ఇది భావనము.

శ్రీ సౌభాగ్యవతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారు

పుణ్యశీల సాధ్వి పండిత అయిన శ్రీమతి జమ్మలమడక కామాక్షీ హైమవతీ దేవిగారి చతుర్దశికి నేను ఏదో వ్రాయబోవడము భావయిత్రీ, భావనమునకు భావోపహారం. "శీతాంశోరమృతార్పణం". శ్రీమతి కామాక్షీ హైమవతీ దేవిగారిని "నేను ఎఱుగుదును" అని చెప్పకోగల భాగ్యంనాకు లభించింది. బహుశాస్త్రవేత్తలు గొప్ప కోవిదులూ అయిన శ్రీ మాధవ రామశర్మగారి దగ్గఱకు నేను అనేక విషయాల్లో నా సందేహాలడిగి తెలుసుకోవడానికీ, నాకు తెలియని చాల విషయాలను తెలుసుకోవడానికీ చాలామార్లు వెళ్తూ ఉండడం అలవాటు. ఎప్పుడు వెళ్ళినా సహజ మందహాసంతో మాధ వార్ధాంగి నన్ను ఎంతో ఆదరించేవారు. "మా అమ్మ" అనే పేరుతో ఈ చతుర్దశి ఆరంభ ప్రస్తావనలో వ్రాసినట్లు శ్రీమతి హైమవతీ దేవిగారు "ఈ విధంగా రచనలు చేస్తా"రని నాకు తెలియదు. ఒకప్పుడు శ్రీ మాధవరామశర్మ గారే అన్నారు; నాతో "లక్ష్మీకాంతమ్మా! ఈమె బాగా వ్రాస్తుంది చదువుతుంది తెలుసా?" అని. తరువాత వారిద్దరూ సంస్కృతంలో సంభాషించుకోవడం కూడా నేను విన్నాను - అంతే. అయితే మాధవార్ధాంగి, జమ్మలమడక వంశ లక్ష్మియైన శ్రీ హైమవతీ దేవిగారు వ్రాయ గల్గినవారు కాకుండా ఎట్లా ఉంటారు? - అనిమాత్రం సామాన్యంగా భావించుకోగలిగాను. కాని ఇక అప్పట్లో శ్రీమతి పాండిత్య ప్రసక్తికి సంబంధించిన వివరాల కొఱకు నేను ఎప్పుడూ అపేక్ష చూపలేదు. అయితే తఱచు నేను వెళ్ళడమూ, వారి ఆతిథ్య భాగ్యం పొందడమూ మాత్రం జరుగుతూనే ఉండేవి.

సరే! ఇటీవల శ్రీమాధవరామశర్మగారు ఈ చతుర్దశీ గ్రంథాన్ని నాకు పంపి దీనిపై నా భావనం వ్రాయమన్నారు.

గ్రంథం విప్పి చూద్దునుగదా! నాకు చాలా ఆశ్చర్యం వేసింది - శ్రీమతి హైమవతీ దేవిగారు ఎంత కోవిదురాలో! అని, అంతేకాదు! "ఈ గ్రంథంపై అభిప్రాయమా?" భయంకూడా వేసింది. నిజంగా రేడియో వారు ఆమెమూలంగా ఎంత చక్కని విలువైన ప్రసంగాలు చేయించారు? ఇదే విషయాలు నాబోటివారికి వారిచ్చినా ఏర్పడే స్వరూపం ఏమిటి? అవి ఇట్లా తయారయ్యేవేనా? అని నాకనిపించింది.

అయితే ఈ చతుర్దశిలో శ్రీ అభినవభారతుల ప్రతిబింబం కనిపించడం లేదా? అంటారట! కొందరు! ఇట్లా అని శ్రీ హైమవతీ దేవిగారి పిల్లలు ఆశంకించుతూ ఉన్నారు. కాని నాకు అట్లా అనిపించడం లేదెందుచేతనో! శ్రీ హైమవతీదేవిగారు ప్రశస్తంగా శుచిగా, రుచిగా పాకం చేయగల సద్గృహిణి - శుచిగా, రుచిగా పాకంచేయగల ఏగృహిణియైనా అభ్యాసంచేస్తే అంతకంటే శుచిగా రుచిగా కావ్యపాకంకూడ చేయగలదు- ఇది మహిళాలోకానికే కాదు! యావత్ప్రపంచానికీ తెలిసిన సత్యం! స్త్రీలకు కావ్యపాకానికి అవకాశం ఇయ్యకుండా "గృహిణి, గృహనిర్వహణ" అని చెప్తూ పాకంలోనే అట్టేపెట్టారు.

అయితే శ్రీ శర్మగారు, ఇంకా కొందరు ఉదారులువేరు. అందువలననే "చతుర్దశి" వంటి ఉత్తమ గ్రంథాలు వెలువడి ఆంధ్ర సారస్వతానికి పరిష్కృతయోపకరణాలైనాయి.

అసలు గ్రంథపఠనం విజ్ఞానాన్ని కోరి, అభ్యుదయాన్ని వాంఛించే ప్రతి మానవునకూ పరమవాంఛనీయం. దుఃఖోపశమనం కోసం, వినోద కాలక్షేపంకోసం, ప్రపంచానుభవంకోసం, జీవన గతి ప్రగతులలో ఆలంబనంకోసం, తన ప్రవర్తనలోగల లోపాలను సవరించుకోడానికి తగిన స్తోమతు నిచ్చే ఆదర్శంకోసం, సదుద్దేశాలు, శుభాలోచనలకోసం, క్రొత్త విషయాలు తెలుసుకొనడం కోసం, ఆలోచనల కోసం, అన్నింటికంటే అపేక్షణీయమైన విజ్ఞానానందాలకోసం మానవులు గ్రంథపఠనాన్ని అభిలషిస్తారు; ఆశ్రయిస్తారు.

ఇక అప్పుడూ అప్పుడూ రేడియోవారి సూచనానుసారంగా శ్రీ కామాక్షీ హైమవతీదేవిగారు ప్రసంగించిన ప్రసంగ వ్యాసాల సంపుటి అయిన ఈ "చతుర్దశి"లో భారత నారీతత్వ ప్రతిపాదకములు, స్త్రీ ధర్మ ప్రబోధకములూ అయిన వ్యాసాలెన్నో ఉన్నవి - అవి చదువుతూ ఉంటే సునిమెత్తనైన మానసిక సంస్కారంతో శ్రీమతి హైమవతీదేవిగారు స్త్రైణాన్నుద్దేశించి ఎంత చక్కగా ప్రబోధించారు? ఎంత ఉత్తమ విషయాలు ప్రకటించారు! ఎన్ని తెలియని అంశాలు తెల్పారు? ఏమీ ఎఱుగనట్లు మాధవరామ గృహంలో ఇల్లు దిద్దుకుంటూ అజ్ఞాత రమణీయంగా మసలిన ఆ ఉత్తమసాధ్వి ఇంత వివేకవతియా? సర్వ సాధారణంగా,

అమాయకంగా కనబడే ఆ ఇల్లాలి హృదయం ఇంతఉదాత్త రత్నకోశమా ? అని అనిపిస్తుంది.

"ఉపేక్షిత వనితలు, రామాయణంలో ఊర్మిళ, ముగ్గురు తల్లులు, కైకేయి, సంస్కృత కవయిత్రులు - త్రివేణి, జైనసాహిత్యములో స్త్రీ, రాధాదేవి, కలభాషిణి, భోజ కాళిదాస కథలు, శృంగారము, హాస్య రసము, రాజయోగము, స్త్రీ దేవతలు, స్త్రీశక్తి, శ్రీగాయత్రి" అనే పదునాల్గుమకుటాలు కల ఈ గ్రంథంలో "భోజ కాళిదాస కథలు, శృంగారము, హాస్యరసము, రాజయోగము" అనే ఈ నాలుగింటిని తప్పిస్తే మిగతాపదీ స్త్రీలవే. స్త్రీరత్నమైన హైమవతీదేవి స్త్రీ విషయకములయిన ఈ వ్యాసాలలో ఒక్కొక్క దానిలో ఒక్కొక్క క్రొత్త విషయాన్ని లోకాని కందించారు. ఈ ప్రపంగ వ్యాసాలు చతువుతూ ఉంటే ఎదురు గుండా ఆమెవచ్చి పలుకుతూ ఉన్నదా అనిపించే విస్పష్ట కథనశీలం ఈ అన్ని వ్యాసాలలోనూ సమాన లక్షణంగా శోభించి ఉన్నది, ఇవి వ్యాసాలే అయినా ఒక చక్కనితల్లి తన బిడ్డల నుద్దేశించి కథలు చెప్తూందా అన్నంత లలిత సుందరంగా ఉన్నది; ఇందులో శైలి.

నిజానికి శ్రీ శర్మగారి సహాయం ఎంతైనా ఉండవచ్చు. అది వస్తు గతమైనది. కాని రచనలోమాత్రం ఇంత సులభమనోహరత, ఇంత కథా కథన గుణమూ, ఇంత ప్రసన్నతా శర్మగారిశైలిలో దొఱకదుగదా ! అని కూడా నాకనిపించింది. మణిహారంలో సూత్రంలాగా ఈ వ్యాసాలన్నిం టిలో అంతర్నిహితంగా ప్రతిభాసించి, అన్నింటికీ ఐక్యధర్మాన్ని ప్రసా దించిన సౌకుమార్యం శ్రీ హైమవతీదేవిగారి 'ఆంతరంగిక హార్దిక ధర్మం, ఇంకా చెప్పాలంటే శ్రీమతిగారి ఆత్మీయమైన శోభనశీలం.

ఆత్మీయమైన ఈ సుకుమార ప్రవృత్తితో ఆమె అక్కడా అక్కడా ఆడవాళ్ళనూ మగవాళ్ళనూకూడా నర్మగర్భంగా, కోమలంగా మెత్తగా మందలించారు. హితవుచెప్పారు.

చూడండి ! ఉపేక్షిత వనితలనే మొదటి వ్యాసంలో "తనుమాత్రం లక్ష్మణునితో బయలుదేరాలని అనుకోలేదూ ! ............ వేదనా పరితాపా లతో ఉన్న ఊర్మిళా వదనముపై ఓ మహర్షి ........ఓ వాల్మీకీ ! చల్లని నీ కమండలూదకమును కొంచెమునైనా చిలకరించ లేదేమయ్యా !...........

ఉపేక్షిత, ఉపేక్షితయేకదా........" అని వాల్మీకి అంతటి సత్త్వగుణ సంపన్నుడూ, మహాపండితుడూ అయిన మహర్షి ఊర్మిళ నుపేక్షించడం తగునా? అంతా ఇంతే! ఇది వాళ్ళచేతిలోని పని. ఇదే ఆడవాళ్లైతేనా ఉచిత సంభావనం చేస్తారు సుమా! అనేటంతభావం వచ్చేటట్లు "ఊర్మిళా దేవి నిద్రఅన్న ఆడవాళ్ళపాటల్లో ఊర్మిళను ఏమీ ఉపేక్షించలేదు." అని తురుపు ముక్కను కాస్తా అతిసున్నితంగా బయట పెట్టారు. అంతే కాదు. ఇదే వ్యాసంలో చివరలో ఆడవాళ్ళకొక చక్కని మందలింపు కూడా ఉన్నది. "నైతికములయిన వ్యవస్థలు స్త్రీలవలన భగ్నములై పోతవి అనే అభిప్రాయానికి స్త్రీలు అవకాశం ఇవ్వకూడదు........అందు కనే స్త్రీలు నానా విషయాలను తెలుసుకొని స్త్రీల అర్హతలను బాగా గుర్తించుకొని స్త్రీలున్నూ రచనా సామర్థ్యం కలవారైనప్పుడు తగిన యోగక్షేమాలు బాగా కలుగుతవి" అని స్త్రీలు ఉపేక్షింపబడడానికి స్వకర్తవ్యపాలనంపట్ల స్త్రీల ఉపేక్షయే కారణం. కాబట్టి స్త్రీలు 'తాము ఉపేక్షింపబడకుండా ఉండేలాగున మసలుకోవాలి' అనే హెచ్చరి కను ఎంతబాగా వారు చేశారో మనం గమనించవలసి ఉన్నది.

సుకుమార హృదయశీలం కల ఊర్మిళను ఉపేక్షించినందుకు వాల్మీకి మీద కలిగిన కోపం అంతా 'రామాయణంలో ఊర్మిళ' అనే వ్యాసంలో చాలా భావుకంగా హైమవతీదేవిగారు ప్రదర్శించారు. "ఊర్మిళ అనేది ఎంత చక్కని పేరు!........ ఈ పేరు పెట్టినందుకైనా వాల్మీకి మహర్షికీ నమస్కరించాలి" అంటారు వారు! ఈ వాక్యంతోనే శ్రీ హైమవతీ దేవిగారు ఊర్మిళపట్ల యావద్భారత జాతి హృదయ సానుభూతిని ఎంతో సమగ్రంగా ప్రతిధ్వనింప చేశారు.

"ముగ్గురు తల్లులు - కైకేయి" అనే మూడవ వ్యాసంలో కైక సుస్వభావాన్ని చాలా ముచ్చటగా ముచ్చటించారు. కైక లేకపోతే రామ కథ ఎట్లా ఉండేది? ద్రౌపది లేకపోతే భారత కథాపరిణామం ఏవిధంగా రూపింపబడేది? అనేవి అసలు భారతీయసంస్కృతికి సంబంధించిన ప్రధాన ప్రశ్నలు. దేవకార్యం కోసం మృదుశీల, సుస్వభావ, సర్వాసుత సమ వత్సల అయిన కేకయరాజనందన పాషాణం అయిపోయింది! ఆ సమయంలో తాను అంతగా కాఠిన్యాన్ని అభినయిస్తే ఆచంద్రార్కం తాను ఎంత అపయశస్సుకు ఒడికట్టవలసి వస్తుందో! అనే దూరాలోచన ఆ మాతృ

మూర్తికి లేకపోలేదు. అయినా సరే పృథివీతలంలోని మానవానీకం అంతా దాంభికంగా అయినా సరే నిలుపపెట్టుకోవాలని పలువిధాల పాట్లుపడే ప్రతిష్ఠను ఆమె లోక కల్యాణం కోసం త్యాగంచేసిన మహానుభావ. శ్రీ రామచంద్రుడంటే కైకేయీదేవికి భరతుని కంటె హెచ్చుప్రేమ, భాస ముఖంగా ఈ సపత్నీ పుత్రప్రేమ ఇంకా ఎంత హెచ్చు శోభతో ముఖరిత మైనదో గమనించండి. "భరతునకు రాజ్యమిచ్చేదా?" అంటాడు దశరథుడు. "పుత్రునకు రాజ్యం వచ్చినంత మాత్రాన స్త్రీకి సంతోషం కలుగదు. రాముడు భూరక్షణానికై జన్మించాడు. రామునికే రాజ్య మివ్వాలి. రామునకు రాజ్యమిస్తే భరతునకు రాజ్యమిచ్చినంత సంతోషం నాకు" అంటుంది కైక. రాముడు భూరక్షణానికై జన్మించిన పురుషోత్త ముడు కాబట్టి భూరక్షణ విధి నిర్వహణంలో రామునిచేత రాజ్యపాలనం చేయించడం ఎంత విధాయకమో అరణ్యవాసం మూలంగా రావణవధ నిర్వహింప జేయడం కూడా అంత విధాయకంగా నీతిజ్ఞ, ద్వంద్వాతీత, గభీర హృదయ అయిన కైకకు తోచింది. సకలజన మనోభిరాముడైన రాముని తన కత్యంత ప్రేమాస్పదుడైన రాముని అడవులకు పంపడాని కెంత పాషాణ హృదయం కావాలో స్వార్థత్యాగం తెలిసిన కైకకు మాత్రమే తెలుసు. తక్కిన తల్లులకు తెలియదు. కాబట్టి మన హైమవతీ దేవిగారు కడపట ఏమంటారో చూడండి. "ముగ్గురు తల్లులలో కౌసల్యా సుమిత్ర లను తెలుసుకోవడం కష్టంకాదు ............... కైకేయీ విషయం బాగా భావించితేనేకాని తెలియదు ...........

అవిదితాంధ్ర సంస్కృత కవయిత్రి అయిన "త్రివేణి" ని గూర్చి లోకానికింతవఱకూ పరిచితంకాని ఎన్ని విషయాలనో శ్రీమతి హైమవతి గారు, 'త్రివేణి' అనే వ్యాసంలో ఉగ్గడించి త్రివేణిని ఆంధ్ర సారస్వతే యులకు సువిదితం చేశారు. సంస్కృతంలో సుమారు పదిగ్రంథాలు వ్రాసిన త్రివేణి ప్రతిభనీవిధంగా వెల్లడి చేయడంలో ఆంధ్ర సాహిత్యాని కెంతో ఉపకారం చేసిన వారైనారు. అంతేకాదు శుచి, దక్షురాలు, మధుర వక్త్రి అయిన భార్యయే లక్ష్మి కాని, కేవల లక్ష్మి లక్ష్మి కాదు" అనిన్నీ, "స్త్రీ ప్రాణులకు ....... సరిగా శిక్షణమూ బోధ ఉంటే (లోకానికి) చాలా విజ్ఞాన వివేకములు లభించుతవనిన్నీ కాళిదాసాది మహాకవుల వాక్యపరంగా స్వకీయహృదయ గ్రంథాన్నికూడా శ్రీమతిగారు విస్పష్టంగా

నిరూపణం చేశారు. ఔను మరి ! విజ్ఞానవతియైన స్త్రీ వలన కలిగే సమా
శ్రేయస్సు ఇంతా అంతా కాదుకదా !

ఎన్ని కష్టాలువచ్చినా, ఎంత హీనంగా లోకంచేత పరిగణింపబడిన
త్యాగరూపిణి అయిన స్త్రీజనత, తాము తలచుకొంటే ఎంత చక్కగా
సంఘసేవ, ధర్మప్రచారము చేయగలరో "జైనసాహిత్యంలో స్త్రీలు"
అనే వ్యాసంలో బాగా రూపించారు.

పరంధాముని దివ్యశక్తి, ప్రేమమయి, ప్రేమ స్వరూపిణి అయిన
రాధికాదేవియొక్క పరమ ప్రేమతత్త్వ నిరూపణం చేయడంలో శ్రీ
హైమవతీ దేవిగారు తన్మయం చెందారనిపిస్తుంది. పరమగుహ్యము, పరమ
పవిత్రము, సర్వసృష్టికీ ఆలంబనభావము అయిన రాధాతత్త్వమును తెలు
సుకో గల్గినవారు ధన్యజీవులే. దివ్య ప్రేమమయి అయిన రాధాదేవి పరా
త్పరుడయిన శ్రీకృష్ణునితో అనుభవించిన "దివ్యలీలలే ప్రేమతత్త్వము"
అని వారుద్ఘాటించడంలో ప్రణయరహస్యం వారికెంత చక్కగా దృగ్గో
చరమైనదో ఆ పవిత్ర ప్రణయతత్వం ప్రాణికోటికెంతగా ఆశ్రయణీయమో
వారు చెప్పకయే చెప్పారు.

రాధాకృష్ణుల ప్రణయలీలా తత్త్వాన్నిగూర్చి లోకంలో అనేకవిధాల
దుర్భావాలు ప్రచారంలో ఉన్నాయి. అన్యపరిణీతయైన రాధాదేవి,
శ్రీకృష్ణుడూ అన్యోన్య ప్రేమాకృష్టులు కావడం, లోకం దృష్టికి తప్పుగా
గోచరిస్తూ ఉన్నట్లు విమర్శలు మనం వింటూనే ఉన్నాం. అయితే శ్రీమతి
హైమవతీ దేవిగారి "ప్రేమ స్వరూపిణి - రాధ" అనే ఈ ప్రసంగ వ్యాసం
చదివిన వారికా సందేహాలు సంపూర్ణంగా తొలగిపోతాయి.

రాధాదేవి పరమాత్ముని దివ్యశక్తి - సృష్టి విపరిణామంతో రాధా
దేవి ప్రకృత్యంశకల జీవుడే. ఈజీవుడు భగవదనుభవంకోసం అహరహమూ
తపించ గల్గిననాడే జీవతత్త్వమునకు సార్థక్యము చేకూరుతుంది. అటువం
టప్పుడు పరిశుద్ధ జీవతత్త్వమైన రాధాదేవి ద్వాపరయుగంలో శ్రీకృష్ణ
పరమాత్మతో బాటు రాధగా అవతరించినపుడు అన్యగృహీత కాకపోయి
నట్లైతే తక్కిన గోపికలవలెనే మాధవ నిత్యసంయోగమును అనుభవించి
యుండేది. అప్పుడిక భగవదనుభవమునకై జీవిపొందే విరహ పరితాపమునకు
అవకాశము, ఆదర్శము లభించి యుండేవే కాదుగదా; రాధిక అన్య

గృహీత కాబట్టే ఆమె నిత్య విరహిణి కాగల్గింది. భగవదనుభవము సాధింపవలసిన జీవునకు యుగయుగాల ఆదర్శము సృష్టిలోని ప్రాణికోటికి ఆదర్శము దిద్దుటకై రాధామహాదేవి భువిలో అవతరించి స్వార్థత్యాగం చేసింది. పవిత్రప్రణయం ఎప్పుడూ త్యాగసిద్ధమే కదా!

"రాధాప్రేమ స్వభావంలో, పరిపూర్ణమైన విరహం కనబడుతుంది.... విరహంలోనే పాఠకుల భావాలకు పరిపూర్ణత్వము వస్తుంది. జీవుడు భగవద్విరహాము ను అనుభవిస్తున్నాడు. నిత్యము భగవానుని ప్రేమించి ఏదో విధంగా భగవద్భావం పొందాలని మహాయత్నం చేస్తున్నాడు. ఆ యత్నాలలో తుది అనుభవాన్ని రాధాభావం సూచిస్తుంది.........." అనినీ్న "కృష్ణుడు దూరానఉన్నా దగ్గరఉన్నా రాధకు విరహామే" అనినీ్న ఉటంకించిన శ్రీమతిగారి వాక్యాలలో ఎంత ఉత్కృష్టమైన త్యాగ, ప్రేమ, జీవతత్త్వ విచారం అణగి ఉన్నదో! "ఈనాటి లోకంలో రాధాభావము ననుభవించగల వాళ్ళెక్కడ ఉన్నారో" అని వ్రాయడంలో మహిళాలోకంనుండి వారు ఎంత మాన్యప్రేమ మార్గాన్ని ఆశిస్తున్నారో పఠితలు తెలుసుకోగల్గితే మహా పండితురాలయిన శ్రీమతి హైమవతీదేవిగారి కృషి ఫలించినట్లే.

ఇట్లాగే "కావ్యనాయికలు - కలభాషిణి"లో కూడా నారీత్వ పరిపూర్ణభావం సిద్ధించడం కొఱకే భారతీదేవి ముంజేతి చిలుక బ్రహ్మ లోకంనుండి భువి కవతరించి మూడుజన్మల తాపత్రయా లనుభవించి కట్ట కడపటిదైన మధురలాలస జన్మలో, నిర్దుష్ట గృహిణీత్వపాలనతో ఆసిద్ధిని పొంది నారీజన్మ సార్థక్యాన్నిపొందినదని శ్రీమతిగారు సిద్ధాంతీకరించారు.

తరువాత శృంగారరసము, హాస్యరసము, రాజయోగము మొదలైన వ్యాసాల్లో అన్ని విషయాల్లోనూ ఆమెకుగల సర్వంకషమైన సునిశిత ప్రతిభా పాండిత్యాలు తెల్లమవుతాయి.

స్త్రీ దేవతలు, స్త్రీ శక్తి నిరూపణము అనే వ్యాసాల్లో స్త్రీ పరాశక్తియొక్క అంశ కనుక స్త్రీని దేవతగా చూడాలని, మాతృమూర్తి అయిన స్త్రీని సద్భావంతో చూచినపుడే లోకకల్యాణం జరుగుతుందని స్త్రీలుకూడా తమయోగ్యతను కాపాడుకోవడం కొఱకు పవిత్ర జీవితం గడపాలనీ, "యోగిని అయిన స్త్రీని దేవతగా" లోకం చూస్తుందనీ,

# అమ్మా!

నీ స్మృతి చిహ్నముగా ఈ చతుర్దశిని ప్రకటించాలని యింతపని చేశాము. నీ స్మృతిలో నీ మృతి మనస్సుకు రాగానే నీ రూపం కన్పడక పోయినా నీ భావం మా లేత హృదయాలకు పట్టింది. మరీ లేతతనంలో మమ్మల్ని ఎంతగా ఆదరించావో నిన్ను నాన్నలో చూస్తూ కొంతగా తెలుసుకుంటున్నాము. నీవు నీవుగానే ఉన్నట్లయితే ఈ చతుర్దశిని చూచి మమ్మల్ని అందరినీ ఒక్కసారి హత్తుకునే దానివి. నీవు చతుర్దశిలో ఉన్నావని మేము అందరము హత్తుకుంటున్నాము. నాన్న నాట్యవేదం వ్రాసేటప్పుడు నీ సహకారం ఉన్నదన్నాడు. ఇది ప్రథమభాగం సంగతి కదా! ఇప్పుడు రెండో భాగం వ్రాస్తున్నాడు. నీ సహకారసంభావనం ఉంది కాబోలు. ఇప్పుడు నీవే ఉంటే నీ సంభాషలన్నీ శతాధికంగా భద్రపరిచేవాళ్ళము. ఈ చతుర్దశిని సంభావించినట్లే ఆ శతపదిని కూడా అందరూ సంభావించేవారు. మాకు అది బలం ఇచ్చేది. ఇప్పుడు ఈ చతుర్దశితో ఎంతెంతో సంపాదించాలని ఉంది. అస్తు.

---

చూడాలనీ, స్త్రీలుకూడా “ఒకరి నొకరు దేవతలుగా భావించడం నేర్చుకోవాలని, ఓజస్సునూ తేజస్సునూ చేకూర్చే గాయత్ర్యుపాసన పూర్వం స్త్రీలుకూడా చేసేవారని, ఇప్పుడుకూడా స్త్రీలు గాయత్ర్యుపాసన చేస్తే మాతృమూర్తి అయిన స్త్రీ ద్వారా సకల మానవ ప్రాణికోటీ ఓజోవంతమూ, తేజోవంతమూ, బుద్ధిమంతమూ అయి జగత్తులో సుఖశాంతులు ప్రతిష్ఠింప బడగలవనీ అప్పుడు విశ్వమానవ కల్యాణ వ్యవస్థ దానంతట అదే సిద్ధిస్తుందనీ, శ్రీమతిగారు స్త్రీ శక్తి నిరూపకములైన దేవీ భాగవతాది ఉద్గ్రంధములనుండి అసంఖ్యాకములైన కధలు ఉదాహరణములు చూపి, త్యాగమయమైన, ప్రేమ స్వరూపమైన భారత నారీ గౌరవాన్ని సర్వ విధాలా ఈ గ్రంథంలో ప్రతిష్ఠించి చూపారు.

ఆత్మతత్వ ప్రతిపాదకమైన పవిత్ర భారతీయ సంస్కృతికి ప్రేమ, త్యాగరూపమైన స్త్రీ ఎట్లా మూలకందమో, అట్టి స్త్రీని లోక కల్యాణం కొఱకు లోకం ఎట్లా సంభావించి సమ్మానించి ఆరాధించ వలసి ఉన్నదో స్త్రీ తన గౌరవ ప్రతిష్ఠలు కాపాడుకొని లోకస్థితిని సముద్ధరించడానికై ఎంత బాధ్యతాయుతమైన పవిత్ర జీవితం గడపాలో ఈ చతుర్దశీ లఘు కృతిలో సోదరి హైమవతీ దేవిగారివలె ఇంత చక్కగా నిరూపణం చేసిన వారు వేరొకరు నా అనుభవంలో నా కందడం లేదు.

ఇక ఈ గ్రంథాన్ని పఠితలూ ప్రభుత్వమూ సరిగ్గా ఆదరించి సుప్రకాశ స్థితిలోకి తీసుకొని రావలసిన అవసరం ఉన్నదనీ, అది ఎవరికో కాదనీ మనకే స్వపర తారకమై అవశ్య కర్తవ్యమనీ నేను వేరుగా నివేదించనవసరం లేదు.

ఈ గ్రంథరాజానికి అభిప్రాయం వ్రాయమన్న పూజ్యులు శ్రీ శర్మగారి ఆదేశమూ, శ్రీ హైమవతీ దేవి మాధవరామశర్మగార్ల సంతానం యొక్క అనురాగమూ నన్ను ఎంత, ఉచ్చైః పదవిలో నిలబెట్టాయో ఊహించుకో గల్గినపుడు వారి ఆదేశానురాగాలకు కృతజ్ఞతతో అంజలి బంధించడం తప్ప నేను చేయగల్గిందేమీ లేదని సవినయంగా విన్నవించుకొంటున్నాను.

---

చూడాలనీ, స్త్రీలుకూడా "ఒకరి నొకరు దేవతలుగా భావించడం నేర్చుకోవాలని, ఓజస్సునూ తేజస్సునూ చేకూర్చే గాయత్ర్యుపాసన పూర్వం స్త్రీలుకూడా చేసేవారని, ఇప్పుడుకూడా స్త్రీలు గాయత్ర్యుపాసన చేస్తే మాతృమూర్తి అయిన స్త్రీ ద్వారా సకల మానవ ప్రాణికోటీ ఓజోవంతమూ, తేజోవంతమూ, బుద్ధిమంతమూ అయి జగత్తులో సుఖశాంతులు ప్రతిష్ఠింప బడగలవనీ అప్పుడు విశ్వమానవ కల్యాణ వ్యవస్థ దానంతట అదే సిద్ధిస్తుందనీ, శ్రీమతిగారు స్త్రీ శక్తి నిరూపకములైన దేవీ భాగవతాది ఉద్గ్రంధములనుండి అసంఖ్యాకములైన కథలు ఉదాహరణములు చూపి, త్యాగమయమైన, ప్రేమ స్వరూపమైన భారత నారీ గౌరవాన్ని సర్వవిధాలా ఈ గ్రంథంలో ప్రతిష్ఠించి చూపారు.

ఆత్మతత్వ ప్రతిపాదకమైన పవిత్ర భారతీయ సంస్కృతికి ప్రేమ, త్యాగరూపమైన స్త్రీ ఎట్లా మూలకందమో, అట్టి స్త్రీని లోక కల్యాణంకొఱకు లోకం ఎట్లా సంభావించి సమ్మానించి ఆరాధించ వలసి ఉన్నదో స్త్రీ తన గౌరవ ప్రతిష్ఠలు కాపాడుకొని లోకస్థితిని సముద్ధరించడానికై ఎంత బాధ్యతాయుతమైన పవిత్ర జీవితం గడపాలో ఈ చతుర్దశీ లఘు కృతిలో సోదరి హైమవతీ దేవిగారివలె ఇంత చక్కగా నిరూపణం చేసిన వారు వేరొకరు నా అనుభవంలో నా కందడం లేదు.

ఇక ఈ గ్రంథాన్ని పఠితలూ ప్రభుత్వమూ సరిగ్గా ఆదరించి సుప్రకాశ స్థితిలోకి తీసుకొని రావలసిన అవసరం ఉన్నదనీ, అది ఎవరికో కాదనీ మనకే స్వపర తారకమై అవశ్య కర్తవ్యమనీ నేను వేరుగా నివేదించ నవసరం లేదు.

ఈ గ్రంధరాజానికి అభిప్రాయం వ్రాయమన్న పూజ్యులు శ్రీ శర్మగారి ఆదేశమూ, శ్రీ హైమవతీ దేవి మాధవరామశర్మగార్ల సంతానం యొక్క అనురాగమూ నన్ను ఎంత, ఉచ్చైః పదవిలో నిలబెట్టాయో ఊహించుకో గల్గినపుడు వారి ఆదేశానురాగాలకు కృతజ్ఞతతో అంజలి బంధించడం తప్ప నేను చేయగల్గిందేమీ లేదని సవినయంగా విన్నవించుకొంటున్నాను.

---

౧౨౪

# అమ్మా!

నీ స్మృతి చిహ్నముగా ఈ చతుర్దశిని ప్రకటించాలని యింతపని చేశాము. నీ స్మృతిలో నీ మృతి మనస్సుకు రాగానే నీ రూపం కన్పడక పోయినా నీ భావం మా లేత హృదయాలకు పట్టింది. మరీ లేతతనంలో మమ్మల్ని ఎంతగా ఆదరించావో నిన్ను నాన్నలో చూస్తూ కొంతగా తెలుసుకుంటున్నాము. నీవు నీవుగానే ఉన్నట్లయితే ఈ చతుర్దశిని చూచి మమ్మల్ని అందరినీ ఒక్కసారి హత్తుకునే దానివి. నీవు చతుర్దశిలో ఉన్నావని మేము అందరము హత్తుకుంటున్నాము. నాన్న నాట్యవేదం వ్రాసేటప్పుడు నీ సహకారం ఉన్నదన్నాడు. ఇది ప్రథమభాగం సంగతి కదా! ఇప్పుడు రెండో భాగం వ్రాస్తున్నాడు. నీ సహకారసంభావనం ఉంది కాబోలు. ఇప్పుడు నీవే ఉంటే నీ సంభాషలన్నీ శతాధికంగా భద్రపరిచేవాళ్ళము. ఈ చతుర్దశిని సంభావించినట్లే ఆ శతపదిని కూడా అందరూ సంభావించేవారు. మాకు అది బలం ఇచ్చేది. ఇప్పుడు ఈ చతుర్దశితో ఎంతెంతో సంపాదించాలని ఉంది. అస్తు.

---

౧౩౾

# మా సాహిత్యశాస్త్ర గ్రంథములు

| | |
|---|---|
| ౧. నాట్యవేదము - ౧ వ భాగము | ౧౩ |
| ౨. నాట్యవేదము - ౨ వ భాగము | ౧౬-౫ |
| ౩. ఔచిత్య విచార చర్చ | 3-౦౦ |
| ౪. రసభారతి - నాటక మీమాంస | ౬-౦౦ |
| ౫. కావ్యప్రకాశము | ౧-౭౫ |
| ౬. ధ్వనిసారము | ౧-౨౫ |
| ౭. రసగంగాధరమణి | ౧-౫౦ |
| ౮. అలంకారసూత్రము | ౧-౨౫ |
| ౯. నవరసగంగాధరము | ? |
| ౧౦. ఆంధ్రప్రతాపరుద్రీయము | ? |
| ౧౧. వక్రోక్తి జీవితము | ? |

— ప్రతులకు —

**జమ్ములమడక మాధవరామశర్మ**

**ఎ. సి. కాలేజి — గుంటూరు.**